# మాస్కో లేఖలు.



రచన:

లిడియా కర్క్

అనువాదం:

శర్మ

PRINTED AND PUBLISHED BY
KUBERA PRINTERS LTD.
"KUBERA BUILDINGS"
21, SUNKURAMA CHETTY STREET,
MADRAS-1 INDIA

మాస్కో రాయబారి పదవినుంచి బెడెల్ స్మిత్ విరమించవచ్చునని 1949 మార్చిమాసంలో పత్రికలు ప్రకటించాయి. ఆ దూరస్థ ప్రాంతంలో రెండు సంవత్సరాలకు పైగా ఆయన ఆ పదవిని నిర్వహించినమీదట, స్వదేశానికి వచ్చి సైన్యంలో తిరిగి పనిచేయాలనుకున్నాడు. నేను ఈ వార్తను చదివాను. మరునాడు కూడా ఇదేవార్త పత్రికలలో మరొకసారి వెలువడడం గమనించాను. ఆయన స్థానంలో ఎవరు నియమించబడవచ్చునా అని ఆలోచించాను. ప్రస్తుతం బెల్జియంలో రాయబారిగా పనిచేస్తున్న నా భర్త అడ్మిరల్ ఆలన్ గుడ్‌రిచ్ కర్క్ ఆ స్థానంలో నియమించబడవచ్చుననుకున్నాను.

ఈ విషయాన్ని గురించి మా ఆయనతో మాట్లాడాను. ఆయ నిది అసంభవమన్నారు. ఈ విషయాన్ని గురించి ఇంకా చాలా మాట్లాడుకున్నాం. నియమించబడట మంటూవుంటే రష్యా, జర్మనీ రాయబారపదవులు రెండు వున్నాయనీ, ఈ రెండిటిలో ఏదీ కాలదన్నడానికి సాధ్యంకానిదనీ మే మిద్దరం ఏకీభవించాం. నిజానికి ఈ రెండు దేశాల రాయబారపదవులూ ఒకదానితో మరొకటి సరిసమానమైనవి.

కొన్ని వారాలు గడిచాయి. అట్లాంటిక్ సంధిషరతుల ముసాయిదా తయారయి వాషింగ్టన్‌లో సంతకాలు జరగ

బోతున్నాయి. నా భర్త బెల్జియంలో పనిచేస్తున్నారు. ఒక శనివారం ఉదయం బ్రసెల్స్ నగరంలోని రాయబార కార్యాలయంలో వున్న టెలిఫోనుగంట మోగింది. ఆ రోజే విమానంలో బయలుదేరి రావలసిందని వాషింగ్టన్ నగరాన్నుంచి వచ్చిన ఆజ్ఞ అది. అందుకు మేమేమీ ఆశ్చర్య పడలేదు.

ఆ రోజు సాయంత్రమే ఆయనను సాగనంపాను. ప్రిన్స్ రీజెంట్ కార్యదర్శి, మా చిరమిత్రుడు అయిన ఆండ్రీ డి స్టేర్కి ఆ శుక్రవారం ఉదయం నన్ను కలుసుకొని బెల్జియమ్ ప్రధానమంత్రి స్పాక్, వాషింగ్టన్ నగరాన్నుంచి తిరిగి వచ్చాడని చెప్పాడు. బెల్జియమ్ ప్రధానమంత్రి అట్లాంటిక్ సంధి సమావేశాలన్నిటికి హాజరై, సంధి పత్రంపైన సంతకం కూడా చేశాడుగాని, నా భర్తను మాత్రం ఆయన వాషింగ్టన్‌లో కలుసుకొనలేదట.

తరువాత, ఆ సాయంత్రం మా వాళ్లను ఒకళ్లను టెలిఫోనులో పిలిచి, ఆండ్రీ చెప్పినదంతా చెప్పాను. అంతట టెలిఫోనులోనుంచి అవతల మాట్లాడుతున్న వ్యక్తి, "మీరు అడిగారు కాబట్టి చెపుతున్నాను, మిసెస్ కర్క్! ఔను. మీ ఆయన మాస్కో రాయబారపదవీ నియామకాన్ని ధృవపర్చమని అసోయేటెడ్ ప్రెస్‌వారు అడుగుతున్నారు," అన్నాడు.

కాబట్టి, నియామకం జరిగిందన్నమాట. ఆయన ఆ పదవిని అంగీకరిస్తారని నాకు తెలుసు. ఆయన అలా అంగీకరించి తీరవలసిందేనని కూడా మేము ఒప్పుకున్నాం. ఇతరపదవు లేవయినా అయినట్లయితే — శాంతి కాలంలోను, యుద్ధ

కాలంలోను కూడా-స్వదేశానికి ఉచితరీతిని చాలాకాలంపాటు సేవ చేశాననిగాని, ఆ హోదాకు తగినంత ఐశ్వర్యవంతుడనూ కానని గాని, తనకు విశ్రాంతి, సౌఖ్యం అవసరమనిగాని సాకులు చెప్పి ఆ పదవిని అంగీకరించకుండా వుండడానికి వీలున్నది. కాని, ఈ పదవి మాత్రం అలాటిది కాదు. అందువల్ల దీనిని అంగీకరించటం జరిగింది — అంటే, మరొక బాధ్యతను నిర్వహించవలసి వున్నదన్న మాట. ఇందులో నేనుకూడా పాలు పంచుకోవలసి వున్నది. అంతేగాక, ఈ గురుతర బాధ్యతను నిర్వహించడం కోసం సులభమైనపనిని, సంతోషదాయకమైన పనిని విడనాడవలసి కూడా వున్నది. అయినప్పటికీ, ఈకొత్త బాధ్యతను నిర్వహించక తీరదు.

ఇంతకుపూర్వమే ఈ నియామకాన్ని గురించి విని వుండడంవల్ల, నా భర్త తిరిగి వచ్చేనాటికి ఈ విషయాన్ని గురించిన కలవరపాటునుంచి తేరుకున్నాను. కనీసం, ఆయన అలా అనుకునేటట్లు చేయడానికై ప్రయత్నించాను. మాస్కోకు వెళ్ళమని కోరినప్పుడు ఆయన ఆశ్చర్యపోయారట. కాని, అందుకు చెప్పవలసిన సమాధానమేమిటో, అందుకు నే నేమనుకుంటానోకూడా ఆయనకు తెలుసు. ఆయన ఆ పదవిని అంగీకరించారు.

మే మొక నెలరోజులపాటు అమెరికాలో ఇంటిపట్టునే గడిపాము. మా బంధుమిత్రులనందరినీ ఒక్కసారి పరామర్శించి వచ్చాము. 'పవర్ ఆఫ్ అటార్నీ' పత్రాలపైన సంతకాలు చేశాము. కొత్తగా వీలునామాలు వ్రాశాము. ప్రతివారు మా పట్ల ఎంతో ఆదరణ చూపారు.

మా అబ్బాయి రోజర్ ఒక సంవత్సరంపాటు కాలేజీ చదువు కట్టిపెట్టి మాతోపాటు మాస్కోలో గడపడానికి నిశ్చయించుకున్నాడు. ఈ నిశ్చయం మాకెంతో సంతృప్తిని కలిగించింది. వాడివయసు 18సంవత్సరాలు మాత్రమే. ప్రిన్స్టన్ యూనివర్సిటీలో జూనియర్ తరగతి చదువుతున్నాడు. నిజానికి, ఆ చదువు వాడి వయసుకు మించినది. వాడికి అప్పటికే రష్యన్ భాష కొద్దిగా వచ్చు. అందువల్ల మాస్కో రాయబార కార్యాలయంలో ఉద్యోగం సంపాదించవచ్చుననీ, తానుకూడా ప్రయోజకుడు కావచ్చుననీ ఆశించాడు. ఇందుకు వాడి ప్రొఫెసర్లు కూడా అంగీకరించారు. నా బిడ్డడు నా దగ్గర వుంటా నంటే నాకెంతో హాయి అనిపించింది. యుద్ధ కారణంగాను, విదేశాంగ శాఖలో ఉద్యోగ కారణంగాను దాదాపు పది సంవత్సరాలపాటు తన కొడుకును విడిచిపెట్టి వున్న నా భర్తకు కూడా ఈ వార్త ఎంతో సంతోషాన్ని కలిగించి తీరుతుంది. అసలు, ముందీ ఆలోచన రోజర్కి కలిగింది. దానిని మేము సంతోషపూర్వకంగా అంగీకరించాం.

రోజర్, నేను న్యూ ఆమ్స్టర్డమ్ అనే ఓడలో ప్రయాణం ప్రారంభించాం. పారిస్లో జరుగుతున్న విదేశాంగ మంత్రుల సమావేశానికి హాజరు కావడానికిగాను నా భర్త వారం రోజులముందే బయలుదేరి వెళ్లిపోయారు. మేము బ్రిల్లన్ నగరంలో ఆయనను కలుసుకున్నాం.

పారిస్లో వున్న న్నాళ్ళూ మాకు కావలసిన వస్తువులను షాపుల్లో కొనడంతోటే సరిపోయింది. రష్యాలో ప్రతి వస్తువు ధర మండిపోతున్నది. అంతేగాక, ఎంతధర పెట్టినా అసలు

వస్తువులంటూ లభ్యం కావడమే గగనం. అందువల్ల, పారిస్ నుంచి మేము విమానంలో వెంటతీసుకు వెళ్లవలసిన వస్తువుల జాబితా తయారుచేశాం.

యుద్ధకాలంలోను, ఆ తదుపరి కొంతకాలం వరకుకూడా మాస్కో రాయబార కార్యాలయానికి ఒక ప్రత్యేక విమానం కేటాయించబడి వుండేది. దరిమిలా, ఆ విమానం మాస్కోలో దిగడానికి రష్యనులు అనుమతించకపోవడంవల్ల ఆ విమానం నిలుపుచేయబడింది. దానికిబదులుగా, రాయబారి ఉద్యోగరీత్యా రష్యానుంచి ఇతరచోట్లకు వెళ్ళి వస్తూ వుండడానికి అవసరమైనప్పుడు మాత్రం మా వైమానిక శాఖవారు ఒక పెద్ద విమానాన్ని సప్లయి చేస్తున్నారు.

విమానంలో పారిస్‌నుంచి బెర్లిన్‌గుండా ప్రయాణం చేసి మేము రష్యా రాజధానికి చేరుకున్నవైనం, ఐదురోజుల అనంతరం మాస్కోనుంచి నేను వ్రాసిన లేఖలో వర్ణించాను.

మాస్కో, జూలై 3, 1949

జూన్ 28 వ తేదీ ఉదయం బెర్లిన్ చేరుకొని టెంపెల్‌హాఫ్ విమానాశ్రయానికి కారులో వెళ్ళాము. మమ్మల్ని తీసుకువెళ్ళడానికి ఒక పెద్ద విమానం అక్కడసిద్ధంగా వుంది. ఆ విమానంలో వున్న ఉద్యోగులలో, మాస్కోలోని అమెరికా రాయబారకార్యాలయ ప్రధానకార్యదర్శులలో ఒకడైన బ్రూస్టర్ మారిస్ కూడా వున్నాడు. వీరితోపాటు, ఇద్దరు రష్యన్లు (ఒకడు వైమానికుడు, రెండవవ్యక్తి రేడియో ఆపరేటర్) కూడా వున్నారు. విమానయాన సందర్భంలో మాకు తోడ్పడడానికిగాను వీరు నియమించబడ్డారు.

మా విమానాలను మా వైమానికులే నడుపుతారు. మా విమానం ప్రయాణం చేయవలసిన మార్గాన్ని మాత్రం రష్యన్లు నిర్ణయిస్తారు. విమానం గాలిలో ఎగరడం మిన హాగా, మా ప్రయాణానికి సంబంధించిన మిగతా అన్ని విషయాలకు ఈ రష్యన్ వైమానికోద్యోగులే బాధ్యులు.

చూడతగ్గ ప్రదేశాలంటూ మాకేమీ కనుపించ లేదు—అటువంటి ప్రదేశాలేవీ మాకు తగలకుండా వుండే విధంగా రష్యన్లు మా విమానం ప్రయాణం చేయవలసిన మార్గాన్ని జాగ్రత్తగా తయారుచేసి వుంటారు.

అలా, ఐదున్నరగంటలసేపు మేము ప్రయాణంచేసి మాస్కోనగరానికి చాలామైళ్ళ దూరానవున్న వ్నుకోవా విమానాశ్రయంలో దిగాం.

అమెరికన్ రాయబారకార్యాలయోద్యోగు లందరూ మమ్మల్ని కలుసుకొనడానికై వచ్చారు. వీరితోబాటు ఒక రష్యన్ అధికారి, నా భర్తకోసం రష్యాప్రభుత్వం నియోగించిన నలుగురు రహస్య పోలీసులు (ఎమ్. వి. డి. గార్డులు) కూడా వచ్చారు. లాంఛనం ప్రకారం, మమ్మల్ని మా సలహాదారు ఫాయ్ కోహ్లర్ ఈ రహస్య పోలీసులకు పరిచయం చేశాడు. నల్లనిసూట్లు, ముందుకువంచిన ఫెల్ట్ హేటులు ధరించి కర్కశుల్లాగా వున్నారు వాళ్లు. వారు ధరించిన తుపాకులు వారి తుంటిపైన ముందుకు పొడుచుకు వచ్చి వున్నాయి. రష్యాకు రావాలంటే ముందు మేము వారిని కలుసుకోవాలి; రష్యాను వదలి వెళ్ళాలంటే మేము వారిని కలుసుకుని మరీ వెళ్ళాలి. ఇదీ నియమం.

నేను వారితో కరచాలనం చేసినప్పుడు వారిలో ఆప్యాయత లేనట్లు అనిపించింది నాకు. వారి పేరు లేమిటో మాకు ఎప్పటికీ తెలిసే ఆస్కారమే లేదు. ఈ రష్యా రహస్య పోలీసుల కాపుదలగౌరవం అమెరికన్, బ్రిటిషు రాయబారులకు మాత్రమే వుంది. 1919 లో జర్మన్ రాయబారి హత్య జరిగినప్పటినుంచీ ఈ సంప్రదాయం అమలు లోనికి వచ్చింది. అప్పటినుంచీ, ప్రధాన దేశాలైన జర్మనీ, బ్రిటన్, అమెరికా రాయబారులకుమాత్రం రాత్రింబగళ్ళు నలుగురు అంగరక్షకుల చొప్పున కేటాయించారు. ఐతే, వీరిలో ముఖ్యులైన నలుగురిని మాత్రమే మేము కలుసుకున్నాం. కాని, ఈ అంగరక్షక దళంవారు సర్వకాలాల్లోనూ కాపలాకాస్తూ వుండవలసి వుంది గనుక మొత్తం వీరు ఎనిమిదిమందో, పన్నెండుమందో ఉండి వుంటారు.

ఇల్లు వదిలి రాయబారి బయటికి వెళ్ళినప్పుడల్లా ఆయన వెనకనే వీరుకూడా కారులో వెడతారు. రాయబారి తన ఆఫీసులోగాని, ఇతర రాయబారుల ఆఫీసుల్లోగాని ఉన్నప్పుడు మాత్రమే వారు కాపలా కాయలేరు. ఎందుకంటే, వాటిలోకి వారు వెళ్ళడానికి అధికారం లేదు. రాయబారి భద్రతకోసం వీరి నియామకం ఉద్దేశించబడిందని అనుకోవాలి.

మాస్కోనగరానికి కారులో ప్రయాణం ప్రారంభించాము. వర్షం కూడా ప్రారంభమయింది. విమానాశ్రయాన్నుంచి మాస్కోనగరానికి కారులో వెళ్లడానికి సుమారు నలభైఐదు నిమిషాలు పడుతుంది. మా కారు వెడుతున్న రోడ్డు విశాలంగా వుంది.

బోల్షివిక్ ప్రభుత్వాన్ని 1933 లో అమెరికా గుర్తించి, బిల్ బుల్లిట్‌ను రాయబారిగా నియమించింది. అప్పుడాయన శ్పాసోహౌస్‌ను రాయబారి నివాసంకోసం కౌలుకు తీసుకున్నాడు. ఇలాగే, రాయబార కార్యాలయంగాను రాయబార కార్యాలయోద్యోగుల నివాసంగాను ఉపయోగ పడటానికిగాను మొఖోవాయా అనే మరొక పెద్ద భవనాన్ని కూడా బుల్లిట్ కౌలుకు తీసుకున్నాడు.

జూన్ 30, 1949

నగరంలో ఎవరికి తోచినట్లు వాళ్ళను స్వేచ్ఛగా ఎందుకు తిరగనివ్వకూడదో, నాకేమీ కారణం కనిపించలేదు. ఆనవాలు కార్డును (Identification Card) బయటికి వెళ్ళినప్పు డల్లా వెంట తీసుకువెళ్ళవలసిందని నా భర్త నన్ను మరీ మరీ హెచ్చరించారు. ఆ కార్డు లేకుండా బయటికి వెళ్ళడమంటే, వంటిమీద గుడ్డలేవీ లేకుండా వెళ్ళడంకంటేకూడా ప్రమాద హేతువు. ఈ నియమం రష్యనుల కందరికీ వర్తిస్తున్నప్పుడు, నా సంగతి వేరే చెప్పనక్కరలేదు. శ్పాసోభవనం చుట్టుపట్ల నున్న ఒకటి రెండు ప్రదేశాలను జాగ్రత్తగా గుర్తుంచుకొని ఆ పరిసరాలలో తారట్లాడాను; సమీపంలోనేవున్న ఆర్బత్ వీధిగుండా నడిచివెళ్ళాను. ఆ వీధి చాలా పురాతనమయింది. క్రెమ్లిన్ ప్రక్కనేవున్న ఆర్బత్ స్క్వేర్ నుంచి ఆ రోడ్డు ప్రారంభమై నగరం శివార్లు దాటిపోతుంది. సోవియట్ ఉద్యోగుల ఊరుబయటి బంగళాలు (డచాస్) కూడా అక్కడే వున్నాయి. నగరం సరిహద్దులు దాటి వెళ్ళడానికి మాకు అనుమతిలేదు.

మాస్కో నగరంలోకల్లా ఆర్బత్ వీధిలోనే పోలీసు నిఘా ఎక్కువగా వుంటుంది. రోడ్డుకు మధ్యగానున్న తెల్లటి చారను దాటి మామూలు కారులు, బళ్ళు మొదలైనవి నడవరాదనే నిషేధాజ్ఞ తీవ్రంగా అమలుజరుగుతున్నదిక్కడ. వీధుల్లో అక్కడక్కడ ఎదురయ్యే రష్యా రహస్య పోలీసులను గుర్తించడం కూడా చాలా తేలికే. వీరి దుస్తులనుబట్టిగాని, అసలు వీరి ముఖవైఖరినిబట్టిగాని ఇట్టే చెప్పివేయవచ్చు.

అసలు ఈ వీధిలోఉన్న షాపులే చాలా తక్కువ. ఆ ఉన్నవైనా వస్తువులేమీ పుష్కలంగా లేనట్లు, ఈసురోమంటూ కనిపిస్తాయి. పందిమాంసం, కోడిమాంసం, మాంసపు కూర, జున్నుగడ్డ, నానురొట్టె మొదలైన తినుబండారాలు అమ్మేషాపులలో ఆ వస్తువుల నమూనాలు అట్టతో తయారు చేసినవి కిటికీలలో ప్రదర్శిస్తున్నారు. ఆహారపదార్థాల కొరత వల్ల ఇలా చేస్తున్నారేమోనని మొట్టమొదట అనుకున్నాను. కాని, అది వీరి ప్రాచీన సంప్రదాయమని నాకు చెప్పారు. సామాన్యులందరూ నిరక్షరాస్యులుగా వున్న కాలంలో ఈ ఆచారం అమలులోనికి వచ్చివుంటుంది. షాపులోపల ఏమేమి అమ్మేదీ కిటికీలో కనిపిస్తూ వుంటుంది.

ప్రస్తుతం రష్యాలో వస్తువు లన్నిటిపైన రేషనింగు ఎత్తివేయబడింది. కాని, తగినంత వస్తూత్పత్తి లేకపోవడం వల్లను, ప్రజల జీవనప్రమాణం చాలా తక్కువగా వుండడం వల్లను షాపులుమాత్రం ఖాళీగానే వుంటున్నాయి. ఇది ఇలా వుండగా, యుద్ధకాలంనాటికంటె ఇప్పుడు పరిస్థితులు ఎంతో బాగుపడ్డాయని మాకు చెప్పారు! మకమకలాడుతూ, మడ్డి

ఓడుతుంటూ వున్న జనం వీధులనిండా గుంపులు గుంపులుగా కనిపిస్తూ వుంటారు—ఇది నమ్మటానికి చాలా కష్టమైన విషయమే. మరి, ఇంతకుపూర్వం వీళ్ళంతా ఎలా వుండేవారో! వీళ్లకితోడు ముష్టివాళ్ళు కూడాను!

విదేశస్థులు ఎంత సాదాదుస్తులు ధరించినప్పటికీ వారి వంక ఇక్కడి జనం తేరిపార జూస్తారు. అలాగే, వీధిలో జనం నన్నూ చూశారు. రష్యనులకు మాకు ఇప్పటికీ చాలా తేడా ఉన్నది. మా చెప్పులు ముఖ్యంగా వారి దృష్టి నాకర్షిస్తాయి. వారిచెప్పుల మడమలు చాలా పల్చగా వుంటాయి. కృత్రిమంగా తయారుచేయబడిన ముతక జోళ్ళలాగా వుంటాయవి. అంతేగాక, వారు తొడిగే జోళ్ళలో చాలాభాగం కాన్వాసు గుడ్డతో తయారుచేయబడి వుంటాయి. ఐతే, వీటిలో అనేక రంగులవి, అనేక ఆకారాలుగలవి మాత్రం వున్నాయి. వీటిలో చాలా మంచిరకం జోళ్ళు, బెల్జియంలో నేను చూచిన చెకోస్లవాకియా దేశపు చౌకపారు జోళ్లను పోలివున్నాయి. అసలైన తోలుతో తయారుచేసిన బూట్లను సైనికులు మాత్రమే ధరిస్తున్నట్లు కనిపిస్తుంది.

స్త్రీలు ధరించే దుస్తులు మరీ విపరీతంగా వున్నాయి. ప్రస్తుతం వేసవికాలంలో స్త్రీలు అద్దకం అద్దిన నూలువస్త్రాలు, రయాన్ సిల్కువస్త్రాలు ధరిస్తున్నారు. వీరి పరికిణీలు పొట్టిగా, కుచ్చిళ్ళేమీ లేకుండా, ఆకారహీనంగాను, చాలీ చాలకుండాను వున్నాయి. ముతకనూలు మేజోళ్ళు, రయాన్ సిల్కు మేజోళ్ళు తొడుగుతున్నారు. కొన్ని షాపుల్లో మాత్రం నైలాన్ సిల్కుదుస్తులున్నాయి. ఒక్కొక్క జత ధర 12

డాలర్లు మొదలు 15 డాలర్ల వరకు ఉన్నది. డాలరుకు ఎనిమిది రూబుల్స్ అనే మారకపు రేటును కృత్రిమంగా అమలుజరుపుతున్నారిక్కడ.

జులై 5, 1949

జులై నాలుగవ తేదీ (అమెరికా స్వాతంత్ర్య దినం) విందు, వేడుకలు అయిపోయినాయి. 400 మంది అతిథులు వచ్చారు. ఇందులో చాలామంది తెల్లవారుఝామున మూడున్నర గంటల వరకూ వున్నారు. అతిథులను ఆహ్వానించడానికి గాను ఫాయ్ కోహ్లర్ తో బాటు నేను, నా భర్తకూడా గ్రేట్ హాల్ గుమ్మంవద్ద నిలబడ్డాము. మా రాయబార కార్యాలయంలో పనిచేస్తున్న సాటివారినందరినీ నేను చూడడం అదే మొదటిసారి. పదిగంటలయేసరికి హాలంతా అమెరికనులతోను, విదేశీయులతోను నిండిపోయింది. పురుషులంతా తెల్లని నెక్ టైలు, వారి వారి గౌరవ పతకాలు, యూనిఫారములు ధరించారు. స్త్రీలు మంచి మంచి గౌనులు ధరించి వచ్చారు.

గ్రోమికోతోసహా సుమారు పన్నెండుమంది రష్యనులు వచ్చారు. గ్రోమికో గోధుమరంగు సూటు ధరించాడు. ఈ సూటు బొత్తిగా నలిగిపోయిందికూడా. ఈ విందుకు రావడానికి గాను ఆయన గడ్డంకూడా చేసుకోలేదు. రష్యనులు తమ కార్యకలాపాల నన్నిటినీ రాత్రి పొద్దుపోయాక చేసుకుంటూ వుంటారు. అందువల్ల సరిగా ఆయన ఆఫీసులో పనిచేసుకునే సమయంలో ఈ విందు జరిగిందన్నమాట. కాని, న్యూయార్కు నగరంలో వుండగా ఇటువంటి ప్రత్యేక సమయాలలో ఆయన

హాజరయినప్పుడు, ఆయన ఎంతో బాగా సింగారించుకుని వచ్చే వాడు. అందువల్ల, ఆయన ఈ విధంగా రావడం మమ్మల్ని గౌరవించడం ఏమాత్రమూ కాదని మేము అనుకున్నాం.

ముప్పావుగంట గడిచింది. అంతే! ఏదో ఒకగంట వినిపించినట్లు, విందు జరుగుతున్న గదిలోనుంచి రష్యను లందరూ బెలబెలా ఇవతలకు వచ్చారు. గ్రోమికో కరచాలనం చేశాడు. మిగిలిన రష్యనులందరూ ఆయన వెనక బారులుతీరి, ఆయనతోపాటు వెళ్ళిపోయారు.

జులై 10, 1949

రెడ్ స్క్వేర్ అత్యద్భుతమైన ప్రదేశం. అనేక శతాబ్దాలుగా రష్యా జాతీయ జీవనానికి అది కేంద్రంగా వుంటూంది. ఇక్కడ రష్యన్ చరిత్రాత్మక సంఘటనలు ఎన్నో జరిగాయి. జారు చక్రవర్తులకు జయజయధ్వానాలు చేయడం గాని,దుమ్మెత్తి పోయడంగాని జరిగిం దిక్కడే. అనేక విజయోత్సవాలు, మరణదండనలు కూడా ఇక్కడే జరిగాయి. రష్యన్ పదం—"క్రాస్నే" అనగా రెడ్ (ఎఱ్ఱని) అనేగాక "సుందరమైన" అనే అర్థం కూడా వుంది. ఈ ప్రదేశం ఆదినుంచీ ఈ పేరుతోనే పిలువబడుతున్నది. ఇది చాలా సువిశాలమైన ప్రదేశం. రెడ్ స్క్వేర్ మాస్కో నగరానికి గుండెవంటిది. నగరంలోకల్లా ముఖ్యమైన కూడలిస్థానం ఇది.

"క్రెమ్లిన్" అనగా "కోట" అని అర్థం. మాస్కో నదికి అభిముఖంగా, కొంచెం ఎత్తైన ప్రదేశంలో ఉన్నది ఈ క్రెమ్లిన్. అసలు, మాస్కో నగరం ఇక్కడినుంచే ప్రారంభ మౌతుంది. దీనిలోపలే చర్చిలు, మఠాలు (ఇప్పుడివన్నీ ప్రభుత్వ

కార్యాలయాలుగా మార్చి వేయబడినాయి) పెద్ద పెద్ద భవనాలు చాలా వున్నాయి. వీటిలోకల్లా పెద్ద భవనం సుప్రీమ్ సోవియట్ సమావేశాలకు ప్రస్తుతం ఉపయోగించబడుతున్నది. క్రెమ్లిన్ కాపుదలకు విశేషమైన శ్రద్ధ తీసుకుంటున్నారు. లోపలికి ప్రవేశించడానికి మూడు గేట్లు మాత్రమే ఉపయోగించబడుతున్నాయి. విదేశస్థులు రెడ్ స్క్వేర్ వైపునుంచి వున్న గేటుగుండా మాత్రమే లోపలికి ప్రవేశించాలి. రెడ్ స్క్వేర్ కి అభిముఖంగా వున్న పెద్ద గేటు ఒకప్పుడు అత్యంత పవిత్రమైనదిగా భావించబడేది. ఈ గేటుకు ఇరువైపుల చిన్న చిన్న 'చర్చి' లుండేవి. కాని వీటిని దరిమిలా కూల్చి వేశారు. గేటుకు ఎడమవైపు గోడవారగా లెనిన్ సమాధి ఉన్నది. మెరుగులు దిద్దిన ఎఱ్ఱరాళ్ళతోను, నల్ల రాళ్ళతోను నిర్మించిన కట్టడ మిది.

రెడ్ స్క్వేర్ లోకల్లా ప్రధానమైన ప్రాంతంలోవున్న ప్రహరీగోడ అరవై అడుగుల ఎత్తున వుంది. ఈ గోడంతా గులాబివన్నె కలిసిన ఎఱ్ఱరాతి ఇటుకలతో కట్టబడింది. నిజానికి, ఈ ప్రదేశం చూడముచ్చటగా వుంటుంది.

రెడ్ స్క్వేర్ చూసివద్దామని నిన్న మేము బయలు దేరి వెళ్ళాము. అక్కడ వాస్తవానికి ఎటువంటి సంఘటనలు జరగడానికి వీలుందో, నిన్నటి విషయాలు చక్కగా నిరూపిస్తున్నాయి. రెడ్ స్క్వేర్ మధ్యలో మా కారు ఒక్క సారిగా ఆగిపోయింది.

ఖాకీ రంగు దుస్తులు, నీలం రంగు టోపీలు ధరించిన సెక్యూరిటీ పోలీసులతో బెలబెలలాడుతూ పదిహేను, ఇరవై

మోటారు ట్రక్కులు రెడ్ స్క్వేర్‌లో ప్రవేశించాయి. వాళ్ళందరూ క్షణంలో కిందికి దిగి, బారుతీరి, అక్కడవున్న జనాన్నందర్నీ అవతలికి తరిమివెయ్యడానికి పూనుకున్నారు. మా కారుడ్రైవరు కూడా గాభరాపడ్డాడు. ఏమికొంప మునగ నున్నదో మాకు తెలియదు. పోలీసులు మాత్రం చాలా చురుకుగా వాళ్ళపనిలో వాళ్ళున్నారు.

రెడ్ స్క్వేర్‌లో వున్న జనాన్ని అవతలికి నెట్టివేయడం పూర్తి అవగానే, వీధులలో జన సంచారాన్ని కూడా వారు అరికడుతున్నారు. పోలీసులు వరుసగా నిలబడి తమముందున్న జనాన్ని సముద్ర తరంగాలు గడ్డిపోచను ఒడ్డుకు నెట్టివేసినట్లు అవతలకు నెట్టివేస్తున్నారు.

ఇంతలో మరికొన్ని పోలీసు ట్రక్కులుకూడా వచ్చాయి. మా కారుడ్రైవరు భయంతో కంపించిపోతున్నాడు. కాని అదృష్టవశాత్తు, ఆ పోలీసు దళాధిపతి మిట్టిమిట్టి చూస్తూ మా దగ్గరకు వచ్చేలోపలే మా కారు కదిలిపోయింది! ఎలాగైతే నేమి, మేము సందుమలుపు చేరుకున్నాం.

బల్గేరియన్ కమ్యూనిస్టునాయకుడు డిమిట్రోవ్ చని పోయాడనీ, యూనియన్ హాలులో వుంచడానికి ఆయన భౌతిక దేహాన్ని తెస్తున్నారనీ ఆ తరువాత మాకు తెలిసింది. ఈ యూని యన్ హాలునే విప్లవానికిపూర్వం ప్రభువులభవనం అనేవారు.

పోలిట్‌బ్యూరో సభ్యులు, తదితర ఉన్నతోద్యోగులు డిమిట్రోవ్‌కు తమ శ్రద్ధాంజలి ఘటించడానికిగాను రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు అక్కడికి వస్తూనే వున్నారు. పోలిట్ బ్యూరో సభ్యులెవరైనా బయటికి వచ్చినప్పుడు అటువంటి

విస్తృతమైన భద్రత చర్యలు తీసుకోనబడుతాయి. రష్యాలో గొప్పగొప్పవారంతా ప్రత్యేకమైన బందోబస్తులున్న కార్లలో చుట్టూ తెరలు బిగించుకుని మరీ ప్రయాణం చేస్తూవుంటారు. వ్యక్తి గొప్పవాడైనకొద్దీ రక్షణకోసం ఆయన వెనకవచ్చే కారులసంఖ్య పెరుగుతూ వుంటుంది కూడా. ఈ కారులకు ప్రత్యేకమైన హారనులు వుంటాయి. ఈ హారన్ శబ్దం పోలీసులకు ప్రజలకుకూడా సుపరిచితమైనదే. అందువల్ల ఇది వినిపించగానే వారు దారి తొలుగుతారు.

జులై 12, 1949

వివిధదేశ రాయబారుల భార్యలను కలుసుకుని వారిని పరామర్శించి రావడం అధికార లాంఛనం. అందువల్ల ఇటువంటి పరామర్శలు జరపడం ఈ వారంనుంచీ ప్రారంభించబోతున్నాను. అంతేగాక, వీటిపట్ల మరింత శ్రద్ధకూడా వహిస్తున్నాను. ఇవాళ ఇటువంటి పరామర్శలు రెండు జరిపి వచ్చాను—మెక్సికో రాయబారి భార్య మడాం రివాస్‌ను, పోలెండు రాయబారి భార్యను కలుసుకుని ఒక్కొక్క గంటసేపు గడిపి వచ్చాను.

పోలిష్ రాయబారి భార్యతో ఫ్రెంచిభాషలో సంభాషించాను. మామూలుగా రాయబారులు మాట్లాడే పరిభాషలోనే మాట్లాడాము: “ఇంతకు పూర్వం మాస్కోనగరం మీకు తెలుసునా?” అన్నాను నేను.

“తెలుసు. యుద్ధకాలంలో నేనిక్కడే వున్నాను. కమ్యూనిస్టుపార్టీ సైన్యంలోచేరి, మా రష్యన్ కామ్రేడ్లతో కలిసి పోరాడడానికై నేనిక్కడికి వచ్చాను,” అన్నది ఆమె.

ఆమె సైన్యంలో కర్నల్ గౌరవాన్ని పొందిందనీ, సైన్యంతోబాటు మాస్కోనుంచి బెర్లిన్ వరకు వెళ్ళిందనీ నేను విన్నాను. నేను కొన్ని ప్రశ్నలు వేశాను. కాని ఆమె సమాధానమేమీ చెప్పలేదు. అందువల్ల మేము మళ్ళీ వాతావరణాన్ని గురించి, పసిపిల్లల్ని గురించి మాట్లాడి, వార్సా పునర్నిర్మాణాన్ని గురించిన ఉత్తేజకరమైన చర్చతో మా సంభాషణ ముగించాం. వార్సా పునర్నిర్మాణం అత్యద్భుతంగా జరుగుతున్నట్లు నేను విన్నానని కూడా చెప్పాను.

ఉపగ్రహ దేశాల రాయబార కార్యాలయాలలోగాని—అసలు, ఏ విదేశ రాయబార కార్యాలయాల్లోగాని—ఆంతరంగిక సంభాషణలు జరపడానికి నిజంగా వీలుండదు. గోడలకు కూడా చెవులుంటాయనే విషయం ప్రతివారికీ జ్ఞప్తికి వస్తుంది. అందువల్ల ఈ రాయబారుల భార్యలతో మాట్లాడుతున్నప్పుడు, నా ప్రవర్తనను గురించి, నా సంభాషణను గురించి వారు ఒక రిపోర్టు తయారు చేస్తూ వుంటారనీ, అలాగే వారి ప్రవర్తనను గురించి, వారి సంభాషణను గురించి మరొకళ్ళు కూడా రిపోర్టు తయారు చేస్తూనే వుంటారనీ నేను గుర్తు వుంచుకున్నాను.

నిజానికి, ఇది చాలా చెడ్డ విషయమే. ఆ పోలిష్ యువతితో మాట్లాడడం చాలా సరదాగానే వుంది. ఆమె తన అనుభవాలను వివరిస్తే విందామనిపించింది నాకు. ఆమె నాతో స్నేహంగా ఉండాలనుకుంటున్నదని కూడా నాకు తోచింది. కాని, అటువంటి స్నేహంకోసం ఎవరైనా ఏమాత్రం ప్రయత్నించినా, మనం చాలా జాగ్రత్తగా

వుండాలి. ఐతే, ఒకవేళ హృదయపూర్వకంగానే మన స్నేహాన్నికై వారు ప్రయత్నించివుంటే, అటువంటివారు చాలా ప్రమాదానికి లోనయే అవకాశమున్నది. లేక, ఒకవేళ వారు కపటస్నేహం నటించగా, వారితో మనం జోస్తీ కలిపామంటే వారు పన్నిన ఉచ్చులలో మనం చిక్కుకునే ప్రమాదమున్నది. నిజానికి ఇదంతా ఎత్తుకు పై ఎత్తుల పాపిష్టి వ్యాపారం.

మెక్సికో రాయబారిభార్య మదాం రివాస్ చాలా సరదా అయిన మనిషి. రష్యాలోను, పోలెండులోను చాలాకాలంనుంచీ రివాస్ దంపతులు వుంటున్నారు.

యుద్ధసమయంలో తను వార్సాపట్టణాన్నుంచి విమానంలో ఎలా పారిపోయి వచ్చిందో ఈ మెక్సికో రాయబారి భార్య అత్యద్భుతంగా వర్ణించింది.

ఎడతెరిపి లేకుండా బాంబులవర్షం కురుస్తున్నప్పటికీ, తమ రాయబారకార్యాలయంలో పని చేస్తున్న కొందరితో బాటు ఆమె ఎలాగో బయటపడింది.

ఈ రివాస్ దంపతులచేత వారి రాయబారకార్యాలయ భవనాన్ని రష్యా విదేశాంగకార్యాలయానికి చెందిన 'బ్యూరోబిన్' బలవంతంగా ఖాళీ చేయించబోతున్నది. విదేశ రాయబారుల అవసరాలన్నిటినీ—వారికి కావలసిన కిస్మస్ కార్డులు మొదలు, వారి గరాజీ (కారుషెడ్డు)లకు పైన కొత్తగా నిర్మించవలసిన కప్పులవరకు, సమస్త విషయాలను ఈ 'బ్యూరోబిన్' శాఖ చూస్తూ వుంటుంది. రష్యాలోని మిగతా ప్రభుత్వశాఖలన్నిటివలెనే ఇది కూడా అర్థరహితమైన నిబంధనలకు, నిరంకుశాధికారులకు నిలయం.

రివాస్ దంపతులు ఖాళీచేయనున్న భవనం రష్యా ఉపగ్రహ రాజ్యాలనుంచి వచ్చిన ప్రతినిధివర్గాలలో ఒకరికి ఇవ్వబడుతుంది. కొత్తగా మెక్సికనుల కిచ్చిన భవనం పూర్వపు భవనంకంటే చాలా చిన్నది. ఇందులో నాలుగు పడక గదులు మాత్రమే వున్నాయి. ఈ భవనంలో ప్రార్థన మందిరమంటూ అసలు లేనేలేదు. "మేము పధ్నాలుగు మందిమి నివసించాలి. ఈ భవనం మాకు చాలదు" అని వారు అంటే, "నాలుగు పడకగదులతో బాటు కావలసినంత చోటున్నది. ఇంకా అంతకంటె మీకేమి కావాలేమిటి?" అని సమాధానం చెప్పారు సోవియట్ అధికారులు.

బ్యూరోబిన్ చర్యలను గురించి బెల్జియం రాయబారి భార్య చాంటల్ గోఫిన్ ఇంతకంటె దారుణమైన విషయాలు మరి కొన్ని చెప్పింది. గోఫిన్ దంపతులు తమ రాయబార కార్యాలయంలోనే నివసించడానికి ఈమధ్యనే మారారు. అంతకుపూర్వం ఒక సంవత్సరంపాటు వారు హోటలులోనే గడిపారు. రష్యన్ భాషను చాంటల్ చాలా బాగా మాట్లాడటం నేర్చుకున్నది. వారు అందరికంటే ఎక్కువ ఇబ్బందుల పాలుకావడానికి ఇదొక కారణం. ఆమె మంచి వయసులో ఉన్నది; ఉత్సాహవంతురాలు. రష్యన్ ఉద్యోగులు, అంగడివాళ్ళు, పనివాళ్ళు మొదలైనవారు అన్నదాని కల్లా తలఊపే మనిషికాదావిడ. ఆమె భర్త లూయీకూడా బెల్జియను లందరివలెనే స్వతంత్రభావాలు కలవాడు. తన హక్కులకొరకై పోరాడగల సాహసం ఉన్నవాడు. అందువల్ల వారు మరిన్ని కష్టాల నెదుర్కొనవలసి వచ్చింది.

వాళ్ళ పనిమనుష్యులలో ఒక తెను గురించి ఆయన నాకు చెప్పాడు. ఆ అమ్మాయంటే వాళ్ళకి చాలా యిష్టంగా వుండేది. అందుకు తగ్గట్టు ఆ అమ్మాయి చాలా కష్టపడి పనిచేసేది కూడాను. పొద్దుటిపూట వచ్చి వాళ్ళకు పని చేసిపోయేది. సాయంత్రంపూట ఫాక్టరీలో పని చేసుకునేది. ఒక రోజున ఆ అమ్మాయి బెల్జియం రాయబార కార్యాలయానికి వస్తుంటే, గేటుదగ్గర ఒక పోలీసు తారసిల్లి ఆమెను నానా విధాలుగాను ప్రశ్నించడం మొదలుపెట్టాడు. ఆ మరునాడు, ఆమె బెల్జియం రాయబారి కార్యాలయంలోగాని, మరే విదేశీయులకుగాని పని చేయడానికి వీలు లేదంటూ ఒక కాగితం ఆమె చేతికిచ్చాడు. తనకు డబ్బు అవసరమనీ, అటువంటప్పుడు తానెందుకు పని చేయకూడదనీ ఆమె అడిగింది. అందుకు సమాధానంగా, ఆమెది చాలా చిన్న వయసు అనీ, ఒకవేళ ఆమె విదేశీయులవద్ద పని చేయాలని నిజంగా అనుకుంటే అందుకుగాను రెండేళ్ళపాటు ప్రత్యేకమైన శిక్షణ పొందవలసి వుంటుందనీ ఆ పోలీసు తెలియజేశాడు. ఆమెకు చాలా ఆగ్రహం వచ్చింది. కాని, ఆమెకు గత్యంతరం లేదు. తాను పని మానివేస్తున్నానని గోఫిన్ దంపతులకు చెప్పక తప్పింది కాదు.

తాము ఏయే విషయాలను గురించి రిపోర్టు చేయవలసి వచ్చిందీ దరిమిలా మరొక పనిమనిషి లూయీకి చెప్పింది. తమ యజమానుల అలవాట్లు జాగ్రత్తగా కనిపెడుతూ వుండవలసిందనీ, వారు ఏమి తింటారో, ఏమి తాగుతారో, ఏయే మందులు ఉపయోగిస్తారో, ఎప్పుడు

పళ్ళుతోముకుంటారో, తమ బ్రష్‌లను ప్రతిరోజూ ఒకేచోట పెడతారో లేదో, వారి దైనందిన కార్యక్రమమంతా ఒకే విధంగా వుంటుందో లేదో, ఒకవేళ మార్పేమైనా వుంటే వారు కలత చెందినట్లు వుంటారా, వీరిలో వీరు పోట్లాడు కుంటూ వుంటారా, వాళ్ళ పిల్లలపట్ల వారెలా ప్రవర్తిస్తారు, మొదలైన విషయాలన్నీ జాగ్రత్తగా గమనించాలని ఆ పని మనుషులకు రష్యన్ అధికారులు ఆదేశిస్తారు. నిజానికి ఇటువంటి చిన్న చిన్న వివరాలనన్నిటినీ దగ్గరగా చేర్చి చూస్తే, ప్రతివారి జీవన విధానం పూర్తిగా తేటతెల్లమౌతుంది.

నిజంగా గూఢచారిణులుగా పనిచేయతగ్గ తెలివితేటలు గాని, పెద్ద చదువుగాని ఈ అమ్మాయిలకు లేదు. కాని, వారు తెలియజేసే విషయాలను బట్టి వ్యక్తుల స్వభావాలను పూర్తిగా గ్రహించడానికి వీలున్నది. వారికి తెలిసిన విష యాల నన్నిటినీ యథాతథంగా గనక వారు తెలియజేస్తే, నిపుణులైనవారు వాటినుంచి చాలా విషయాలను ఊహించ డానికి వీలున్నది. అమెరికన్ రాయబార కార్యాలయా న్నుంచి కూడా ఇలా విషయాలు బయటకు తెలుస్తున్నాయనే నా వుద్దేశం. ఐతే, మా దగ్గర వున్నవాళ్ళలో ఇద్దరు ముగ్గురు చాలా నిపుణులైన పనివాళ్ళున్నారు. ఉదాహరణకు: మా గేటుకాపలావాడుగా వుంటున్న మైక్, ఇంతకు పూర్వం పెద్ద కాపలావాడుగా వుండేవాడు. వాడు చాలాభాషలు మాట్లాడ గలడు కూడాను.

ఇక్కడ పనిచేస్తున్నవారు దాదాపు ఇరవైమందిదాకా వున్నారు. వీరందరికీ ముప్పొద్దులా తిండిపెట్టాలి. చైనా

కుక్కవాళ్ళిద్దరూ తప్ప మిగతా వాళ్ళెవ్వరూ అనుభవమున్న పనివాళ్ళు గారు. ఈ చైనా కుక్కవాళ్ళు సుమారు పదిహేను సంవత్సరాలకు పూర్వం, డి మారీ బెస్ అనే విదేశ పత్రికా విలేఖరి వెంట మాస్కోకు వచ్చారు. దరిమిలా రష్యన్ స్త్రీలను పెళ్ళి చేసుకున్నారు. వీరికి పిల్లలు కూడా వున్నారు. కాని, రష్యానుంచి వెళ్ళిపోదామంటే అందుకు వీరికి అనుమతి పత్రాలు లభించలేదు. అందువల్ల, అమెరికా రాయబార కార్యాలయంలో పనిచేస్తూ మాస్కోలో వుంటున్నారు. వీరి భార్యలు కూడా శ్పాసోభవనంలోనే పనిచేస్తున్నారు. వీళ్ళు కూడా చాలా మంచివాళ్ళు. వీళ్ళంటే వీళ్ల భర్తలకు ఎంతో అనురాగం కూడాను.

గత రాత్రి మేము విందు ఏర్పాటు చేశాము. అది కేవలం యువతీ యువకులకుమాత్రమే చేయబడిన విందు—వివిధదేశ రాయబార కార్యాలయాలలో పనిచేసే జూనియర్ సలహాదారులను, కార్యదర్శులను మాత్రమే విందుకు ఆహ్వానించాము. రాయబారులను ఎవ్వరినీ ఆహ్వానించ లేదు. బెల్జియమ్, గ్రీసు, ఇండియా, బ్రిటన్, ఇటలీ, మెక్సికో, ఫ్రాన్సు దేశాల రాయబార కార్యాలయోద్యోగులు ఈ విందుకు హాజరయారు. ఇటువంటి విందులకు రష్యనులను ఎన్నడూ పిలిచే అలవాటులేదు. ఒకవేళ పిలిచినా వారు రారు. వారి ఉపగ్రహ రాజ్యాలవారు జాతీయ దినోత్సవాల సందర్భంలో అధికార పూర్వకంగా పిలిచే పిలుపులకుమాత్రమే హాజరవుతూవుంటారు.

మమ్మల్ని వదిలివెళుతున్న మా సలహాదారు ఫాయ్ కోహ్లర్ గౌరవార్థము, ఎమ్మెర్సన్ దంపతుల గౌరవార్థము

ఈ విందు ఏర్పాటుచేయబడింది. ఫాయిక్ కోస్లార్ మా వద్ద పనిచేస్తున్న రష్యా దేశీయ వ్యవహార నిపుణుడు.

ఎమ్మెర్సన్ దంపతులు చాలా ఢక్కా మొక్కీలు తిన్నవారు. మాస్కో నగరానికి వెలుపల, నేలకొరిగిన ఒక పూరిపాకలో, విచ్చిపోయిన గోడ నెరియలలో నుంచి జిమ్మున వీచే చలిగాలిని, కింద నేలలోనుంచి ఊరుతున్న చెమ్మను సహిస్తూ రెండు సంవత్సరాలపాటు గడిపారు వీరు. ఆ పూరిపాకచుట్టూ మంచి తోట అంటూ ఒకటి వుండడం వల్లను, అక్కడ అయితే తమ పిల్లలిద్దరూ స్థానిక పాఠశాలలో చదువుకొనడానికి వీలువుండడంవల్లను వారక్కడే వుండడానికి నిశ్చయించుకున్నారు. వారి పిల్లలలో ఒకడికి తొమ్మిదిసంవత్సరాలు, మరొకటికి ఏడు సంవత్సరాలు. ఈ పిల్లల తరువాత, రష్యన్ పాఠశాలల్లో విదేశీయుల పిల్లలను మరెవ్వరినీ చేర్చుకొననేలేదు. రష్యా ఉపగ్రహ రాజ్యాలవారి పిల్లలనుమాత్రం చేర్చుకుంటూ రనుకుంటాను. కాని, మన పిల్లలనుమాత్రం ఏ పాఠశాలలోను చేర్చుకోరు.

ఎమ్మెర్సన్ దంపతులను చూచి పోవడానికై ఇరుగు పొరుగువారు ఎవరూ వచ్చేవారుకాదు. కాని, ఇరుగు పొరుగు పిల్లలు మాత్రం, ఐస్ క్రీం, చాకొలెట్లకు ఆశపడి ఎమ్మెర్సన్ దంపతుల పిల్లలతో ఆడుకుంటానికి వచ్చేవారు. ఈ పిల్లలు కూడా ఇరుగుపొరుగు రష్యనుల ఇళ్లకు పోయి వస్తూవుండేవారు. మాస్కో నగరమంతటా కూడా ఇలాగే రష్యా వారు విదేశస్థులను వెలివేస్తూ వుండివుండాలి. పూర్వం ఇలాగే జరిగింది. కాని, ఈనాడు పిల్లలు ఒకరితో ఒకరు

కలిసి ఆడుకొనడానికి కూడా అవరోధాలు ఏర్పాటు చేయబడ్డాయి.

ఒక భవననిర్మాణపు అజమాయిషీదారువద్ద పని నేర్చుకొనడానికి మా అబ్బాయి రోజర్ కుదిరాడు. రష్యన్ భాష బాగా మాట్లాడటం నేర్చుకోవాలని ఉబలాట పడుతున్న వాడికి ఇది చాలా తగినఉద్యోగం. పనివాళ్ళని గదమాయిస్తూ, వారితోపాటు పని చేస్తూ అజమాయిషీదారుకు వాడు సహాయకుడుగా వుంటాడు. విడ్డూర మేమంటే, ఒక దేశపు రాయబారి పుత్రుడు రెక్కల కష్టం చేయడానికి సంసిద్ధుడై, అలా చేయగలుగుతున్నాడంటే, ఈ "సర్వ సమానత్వం వెల్లివిరుస్తున్న దేశం" లోని ప్రజలకు నమ్మ శక్యంగాకుండా వున్నట్లు కనిపిస్తున్నది. నిజానికి, వర్గాధిక్యతాభావం రష్యా వారిలోనే ఎక్కువగా వుంది.

సరిగ్గా ఇవ్వాళ ఉదయం తొమ్మిదిగంటలకల్లా వాడు పనిలో చేరాడు. వాడెలా పని నేర్చుకుంటాడో చూడాలని నాకు మహా సరదాగా వున్నది. రష్యన్ విధానం ప్రకారం యిళ్లు కట్టడం, యిళ్లు మరమ్మతుచేయడం నేర్చుకున్నందువల్ల ఉత్తరోత్తరా మా యింటిలోనే ఏమైనా చిన్నచిన్న మార్పులు చేయవలసివస్తే, తనే వాటిని సునాయాసంగా చేసివేయగలడు. తరువాత, ఆదర్శగృహస్థు కావడానికి కూడా ఈ పరిజ్ఞానం వాడికి తోడ్పడుతుంది. అంతేగాక, వాడు శ్రద్ధగా, ఎంతో ఉత్సాహంతో పనిచేసే స్వభావం కలవాడు కూడాను.

జులై 17, 1949

రెడ్ ఆర్మీ వైమానిక ప్రదర్శనాన్నుంచి ఇప్పుడే తిరిగి వచ్చాము. ఈ వైమానికదళ ప్రదర్శనాలు యేటేటా జరుగు తాయి. ఇలా బ్రహ్మాండమైన ప్రదర్శనాలను ఏర్పాటు చేయడానికై మార్షల్ స్టాలిన్, పొలిట్ బ్యూరో సభ్యులు, ప్రభుత్వపు ఉన్నతోద్యోగులు, విదేశాంగ శాఖోద్యోగులు సంయుక్తంగా కృషిచేస్తారు. ప్రత్యేకంగా ఆహ్వానించబడిన వారికి మాత్రం టూషినో విమానాశ్రయపు ప్రధానమంటపం లోనికి టిక్కెట్లు యిచ్చారు. కాని, మిగతా జనసామాన్య మంతా విమానాశ్రయం చుట్టూ కిటకిటలాడుతూ వున్నారు. వీరికిముందు రష్యన్ పోలీసులు ఒకరి బుజాలను ఒకరు రాచుకునేటంత దగ్గర దగ్గరగా దడికట్టి వున్నారు.

ఈ ప్రదర్శనమంతా రెండు గంటలపాటు జరిగింది. అనంతరం, స్టాలిన్ అక్కడినుంచి అదృశ్యమయాడు. ఆ తరువాత, ఆయన పరివార జనం అంతా కదిలివెళ్లారు. మిగిలిన వాళ్ల కారులన్నీకూడా బయలుదేరాయి. మేము భవనం వెనుకభాగానికి వచ్చి నిలబడ్డాము. అక్కడికి మాకారు వచ్చింది.

తిరిగి మేము మాస్కోనగరానికి చేరుకుంటున్నాం. మేము ప్రయాణం చేస్తున్న మార్గాన్నంతా పోలీసులు వెయ్యి కళ్లతో కాపలా కాస్తూన్నారు. నల్లరంగు పెద్దపెద్ద కారులు, విపరీతమైన వేగంతో మమ్మల్ని అధిగమించి, రోడ్డుమధ్యగా పోతున్నాయి. అలా పోయేకారునుబట్టి అందులోని వారెవరో రష్యా ప్రభుత్వ పెద్దలై వుంటారని గ్రహించవచ్చు. కొన్ని

వీధులలో మధ్యనుంచి ప్రయాణం చేసేహక్కు వారికి మాత్రమే వుంది. విదేశ రాయబారులతోసహా మిగిలినవారి కారులన్నీ రోడ్డువారగా వున్న చిన్న బాటగుండా పోవలసిందే.

రష్యాకు సంబంధించిన అనేక విషయాలను గురించి ఎవరినైనా అడిగి తెలుసుకోవాలని మనస్ఫూర్తిగా నాకు ఉద్దేశం వుంది. గత రెండువారాలుగా నేనిక్కడ వుంటున్నాను. మా రాయబార కార్యాలయంలో వుంటున్న రష్యన్ పని వాళ్ళతోను, జులై నాలుగవ తారీఖున మేము ఆహ్వానించి నప్పుడు వచ్చిన రష్యా విదేశాంగ కార్యాలయో ద్యోగులతోను తప్పితే మరెవ్వరితోను నేను మాట్లాడనేలేదు. ఇంకా ఇతర దేశాల జాతీయ దినోత్సవాల సందర్భంలోకూడా ఈ రష్యన్ కార్యాలయోద్యోగులే వచ్చారు. దానిని బట్టి చూడగా ఇతరుల నెవ్వరినీ కలుసుకునేటందుకు అవకాశమే లేనట్లున్నది. గ్రోమికోతో మాట్లాడినప్పుడు, మాస్కోలో వుండడానికి మేమెంతో ఉత్సాహ పడుతున్నామని చెప్పి, ఆయన భార్య ఆరోగ్యాన్ని గురించి మాత్రమే పరామర్శించాను. రష్యా విదేశాంగ కార్యాలయోద్యోగులతో మాట్లాడినప్పుడుకూడా మాస్కోలో వున్నందుకు మాకెంతో సంతోషంగా వున్నదని చెప్పి, ఆపైన వాతావరణాన్ని గురించిన కబుర్లు ప్రారంభించాను. ఈ సంభాషణ అంతా జరిగింది ఫ్రెంచి భాషలో.

మదాం విషిన్‌స్కీనిగాని, ఇతర రష్యన్ ప్రభుత్వో ద్యోగుల భార్యలనుగాని చూడాలనుకుంటున్నానని వారికి కబుర్లుచేశాను. కాని, ఇంతవరకు వారిదగ్గరనుంచి సమాధానం

సానేలేదు. విదేశ రాయబారులలోకల్లా ఎక్కువకాలంనుంచీ రష్యాలో వుంటున్న ఇటలీ రాయబారి భార్య మదాం బ్రోసియోకు కూడా రష్యన్ ఉద్యోగుల భార్యలను కలుసుకునేటందుకు అవకాశం లభించలేదట. ఈవిషయాన్ని ఆమే నాకు చెప్పింది. వారిలో ఎవ్వరితోను మనం స్నేహంగా వుండడానికి వీలుకాదు. ఉద్యోగవశాత్తు, విదేశాలలో వున్నప్పుడు పూర్వ పరిచయమున్న రష్యావారు కూడా ఇక్కడ మనతో చాలా ముక్తసరిగా మాట్లాడుతారు. వారిని మన యిళ్ళకు రమ్మని ఆహ్వానిస్తే అందుకు వారు నిరాకరిస్తారు. నిజానికి వారిలో భావ పరివర్తనం తీసుకురావాలనిగాని, లేక, నేను భావ పరివర్తనం పొందాలనిగాని ఆశించను. కాని, స్నేహస్వభావంగలదాన్ని గనుక వారితో కలిసి మాట్లాడాలని మాత్రం వాంఛిస్తాను. అంతే. కాని, అందుకుకూడా వీలులేదిక్కడ.

జులై 19, 1949

మాస్కో నగరం శివార్లలో 'న్యూ మెయిడెన్స్' అనేప్రాంతంలో ఉన్న ఒక ప్రఖ్యాతమైన మఠాన్ని చూసి రావడానికి మా అబ్బాయి రోజర్, మా రాయబార కార్యాలయ కార్యదర్శి జాన్ కెప్పెల్, నేను కలిసి నిన్న వెళ్ళాము. ఈ మఠం చాలా పురాతనమైనది. ఇక్కడవున్న రెండు చర్చిలు—ఒకటి మ్యూజియంగాను, రెండవది ప్రార్థనాలయంగాను—పునరుద్ధరించబడినాయి.

విప్లవానికి పూర్వం మాస్కోనగరంలో వందలకొద్ది చర్చిలుండేవి. ప్రస్తుతం, ఒకపాతిక చర్చిలలో మాత్రం

ప్రార్థనలు జరుపుకొనడానికి అనుమతి వున్నదనుకుంటాను. న్యూ మెయిడెన్స్ ప్రాంతంలోవున్న చర్చిలోపలికి వెళ్లాను. రష్యాలో నేను లోపలికి అడుగుపెట్టిన మొట్టమొదటి సనాతనచర్చి ఇదే. ఐతే, పారిస్‌లోవున్న సనాతన రష్యన్ చర్చికి మాత్రం చాలా సంవత్సరాలకు పూర్వం నేనొకసారి వెళ్లాను. సాయంకాల ప్రార్థనా సమయానికి సరిగ్గా మేము అక్కడికి చేరుకున్నాము. చర్చినిండా జనం వున్నారు. ప్రార్థన చేయడానికై వచ్చిన వారిలో చాలామంది స్త్రీలు. వీరిలో చాలామంది ముసలి వగ్గులు; కటిక దరిద్రులు. వారి దుస్తులన్నీ మురికి వోడుతున్న చింపిరి పేలికలు. తలపైన మాత్రం రుమాళ్ళు ధరించారు. కాని వాళ్ళందరూ చాలా భక్తి తత్పరుల్లాగా వున్నారు. అందరూ శిలువలు ధరించారు. వారంతా మోకరిల్లి, చివరికి తమ శిరస్సులతో భూమిని స్పృశించికూడా ప్రార్థనలు జరిపారు.

జులై 20, 1949

కార్మికులంతా అధికారులంటే మండిపడు తున్నారని నిన్న రోజర్ చెప్పాడు. అక్కడ పని చేస్తున్న ఒకడికి ఆనాడే వచ్చి సైన్యంలో చేరవలసిందని ఒక హుకుం జారీ అయింది. ఆ కార్మికుడు మంచి వయసులో వున్నాడు; బాగా పనిచేసేవాడు కూడాను. అతడికి కొంచెం కాలవ్యవధి నివ్వడంగాని, అతడిని ఏ విధంగాను పరీక్షించడం గాని జరగలేదు. ఐదురోజులకు సరిపడిన ఆహార పదార్థా లను మాత్రం యిచ్చి, సైన్యంలో చేరమన్నారు. అంతే. సోవియట్ యూనియన్‌లో జారీ అయే ఉత్తరువులన్నీ అంత నిరంకుశంగానూ వుంటాయి. వాటిని గురించి ప్రశ్నించ

డానికిగాని, ఫిర్యాదు చేసుకోనడానికిగాని వీలులేదు. కాని, మా దగ్గర బాగా పనిచేస్తున్న వాళ్ళలో ఇత డొకడు కావడంవల్ల, మమ్మల్ని అగచాట్ల పాలుచేయడానికిగాను ఇతడిని వచ్చి సైన్యంలో చేరమని ఉత్తరువు వచ్చి ఉండ వచ్చునని మా అబ్బాయి రోజర్ వివరించాడు.

వాయిస్ ఆఫ్ అమెరికా రేడియో కార్యక్రమాలు విందామని రేడియో తిప్పితే ఉట్టి రణగొణ ధ్వని మాత్రం వినిపిస్తూంది. ఇందువల్ల, పిచ్చెత్తినట్లుగా వుంటూంది. అలాటి రణగొణ ధ్వని మాత్రమే వినిపిస్తూన్నదంటే, ఆ రేడియో కార్యక్రమాలు వినిపించకుండా రష్యనులు గజిబిజిచేసి వేస్తున్నారన్నమాట. మాస్కో నగరానికి వెలుపల మాత్రం ఈ కార్యక్రమాలు కొంచెం బాగానే వినిపిస్తాయి. ఇంగ్లీషు భాషలో వెలువడే కార్యక్రమాలను సరిగానే ప్రసారం కానిస్తున్నారు.

బి. బి. సి. కార్యక్రమాల విషయంలో కూడా ఇలాగే జరుగుతున్నది. ఆ రష్యన్ కార్యక్రమాలను కూడా వినబడ కుండా చేస్తున్నారు. ఒకవేళ, వాయిస్ ఆఫ్ అమెరికా రష్యన్ భాషా కార్యక్రమాలను గజిబిజి చేయరను కున్నప్పటికి, వాటిని రష్యన్లు వినడానికి ఒక ప్రతిబంధక మున్నది—రష్యాలో గృహావసతి చాలా తక్కువగావుంది. అందువల్ల ప్రతి చిన్నగదిలోను కనీసం ఇద్దరిద్దరైనా కలిసి వుంటున్నారు. అటువంటప్పుడు రెండవవ్యక్తి గదిలో వుండగా విదేశాలనుంచి ప్రసారమయే రేడియో కార్య క్రమాలను వినడానికి ప్రతివారు సందేహిస్తారు. ఇటువంటి

రేడియో కార్యక్రమాలవల్ల ఇక్కడి ప్రజలు ఉత్తేజితులు కాకపోవడానికి ఇదికూడా ఒక కారణమని అంటున్నారు. ఆ కార్యక్రమాలను వినకుండా చేయడానికి ప్రతివారి గదులలోను ఎవరో ఒకరు ఎప్పుడూ వుంటూనే వుంటారు.

అంతేగాక, రష్యన్ పోలీసులు సర్వాంతర్యాములు. పోలీసులు నగరంలో వేలకొద్దిమంది ఉండివుంటారు. పెద్దపెద్ద భవనాల గుమ్మాలముందు, ప్రతి సందుమలుపులోను ఇటువంటివారు ఒక్కొక్కరు చొప్పున వుంటూ వుంటారు. ఈ వేళ పోలిష్ జాతీయ దినోత్సవాలు చూచి రావడానికి తయారయినాము. రష్యా విదేశాంగ కార్యాలయోద్యోగులు యావన్మందీ, ఇంకా ఇష్టులైన ఇతర రష్యనులు వచ్చిన మీాదట ఈ కార్యక్రమాలు రాత్రి తొమ్మిదిన్నర నుంచీ ప్రారంభమయాయి.

పశ్చిమ దేశస్థులైన మమ్మల్ని ఈ విందులో పూర్తిగా వెలివేశారు. రష్యా ఉపగ్రహరాజ్యాలవారు మమ్మల్ని చూసి 'ఓ హో!' అంటే 'ఓ హో!' అనడంతప్పితే మరేమీా లేదు. రష్యనులనెవ్వరినీ పరిచయం చేయడం కూడా అంతకుమునుపే లేదు. అసలు వాళ్ళ నందరిని చూస్తూంటే నవ్వుపుట్టుకొస్తూంది—ముఖ్యంగా, రష్యన్ సేనానులను చూస్తూ వుంటేనే ఇలా అనిపిస్తుంది. బలిష్ఠులుగా కనుపించడానికిగాను వారు తొడిగే దిళ్ళుకుట్టిన యూనిఫారాలు, వారు ధరించే వీరపతకాల వరసలు చూస్తూ వుంటే కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వు వస్తూంది. వారి యూనిఫారాలలో దిళ్లుఉన్నమాట వాస్తవం. ఒక మంగలి

షాపులో ఇటువంటి కోటు ఒకటి వంకెకు తగిలించివుండగా దానిని, మా కార్యదర్శి జాన్ క్రెపెస్ పరీక్షించి చూశాడు. మంచి ఆకారాన్ని ఇవ్వడానికిగాను, రొమ్ములదగ్గర ఆ కోటులో దిళ్ళుకుట్టి వున్నాయి. అటువంటి రూపం కలిగి వుండడమంటే రష్యన్ సేనానులకు ఎంతో మోజు.

జూలై 27, 1949

ఎంత ఆశ్చర్యకరమైన విషయం! వచ్చే బుధవారం నాడు ఐదుగంటలకు నేను మదాం విషిన్‌స్కీని కలుసుకో బోతున్నాను. విదేశ రాయబారుల భార్యలు ఎవరైనా తనను కలుసుకొనడానికి ఆమె అనుమతి నివ్వడం ఇదే మొదటి సారని నేను విన్నాను. అందువల్ల ఈ అంగీ కారంలో ఏదో కొంత ప్రత్యేకత వుండి వుంటుందను కుంటున్నాను.

మదాం విషిన్‌స్కీ అంగీకరించిందా అని గ్రోమి కోను నా భర్త అడిగారు. అంగీకరించినట్లయితే, నేను ఆమెను కలుసుకుని నా నమస్కృతులు తెలియజేసి రావ డానికి ఎంతో ఆసక్తి చూపుతున్నానని కూడా ఆయన తెలియజేశారు. నన్ను ఆవిడ తన యింటికి వచ్చి కలుసు కొనని స్తే బాగుంటుందనుకొన్నాను. కాని, నా భర్తమాత్రం ప్రభుత్వపు ఆతిథ్య గృహాలు దేనికో ఒకదానికి పోయి నేను ఆమెను కలుసుకోవలసి రావడం తథ్యమని భావిస్తు న్నారు. మమ్మల్ని ఎవ్వరినీ (కేవలం అమెరికన్లనే కాదు అసలు విదేశ రాయబారుల నెవ్వరినీ) రష్యన్ ఉద్యోగులు తమ యిళ్ళకు పిలవనే పిలవరు. అందువల్ల వాస్తవానికి

వారు ఎక్కడ వుంటూవుంటారో మాకు తెలియదు.
ఆమెను చూడడానికి వెళ్ళేటప్పుడుమాత్రం నాకున్న వాటిలో కల్లా మంచి దుస్తులు ధరించా లనుకున్నాను. ఐతే, ఇందుకు తగ్గట్టుగా ఆమె కూడా ఇంత నాజూకైన బట్టలు ధరించి వుంటుందని ధైర్యంచేసి చెప్పగలను.

జులై 28, 1949

నిన్న నేను మదాం విషిన్‌స్కీని కలుసుకొన్న విశేషాల్ని ప్రత్యేకంగా ఒక ఉత్తరం వ్రాయవలసి వుంది.

నేను ప్రయాణమై వెళ్ళబోతూ, మా రాయబార కార్యాలయపు గేటుకాపలా వాడైన మైక్‌ను, మదాం విషిన్‌స్కీకి ఫ్రెంచి భాషవచ్చునా అని అడిగాను. "చాలా బాగా వచ్చునమ్మా? ఆవి డేమీ చిన్నదీ చితకదీ కాదు. 'వెనకటి పెద్దల' (విప్లవానికి పూర్వపు గొప్పవారు) వంశస్థురాలు ఆవిడ" అని సమాధానం చెప్పాడు మైక్.

మదాం విషిన్‌స్కీ అరవయ్యోపడిలో పడిన మనిషి; చాలా సన్నగా వుంది. అనారోగ్యంగా వున్నట్టు, బాగా నలిగి పోయినట్లుకూడా కనుపిస్తున్నది. కాని, ఆమె అలంకరణ మాత్రం చాలా అందంగాను, నిరాడంబరంగాను ఉన్నది. సాదాగా వుండే బూడిదరంగు గౌను, పాతకాలపు సిల్కు ముత్యాల దుద్దులు ధరించింది.

ఫ్రెంచిభాష మాట్లాడుతారా అని ఆమెను అడిగాను. నేనుకూడా ఆభాష మాట్లాడగలనని తెలుసుకునేసరికి ఆమెకు ఎంతో తెరిపిని పడ్డట్లనిపించింది. కాని, ఆమెతో వున్న మిగతా ముగ్గురు స్త్రీలు ఇందువల్ల కలతజెందినట్లు కనుపించారు.

ముఖ్యంగా, ఆమెవద్ద దుబాసీగా వ్యవహరిస్తున్న స్త్రీ ఇలా కనుపించింది.

వాతావరణాన్ని గురించి మాట్లాడడంతో మా సంభాషణ ప్రారంభమయింది. నిజానికి ఇంత ప్రమాద రహితమైన విషయము, ఎప్పుడైనా ఎక్కడైనా నిర్భయంగా మాట్లాడతగ్గ విషయము మరొకటి వుండబోదు. ఆ తరువాత, మాస్కోనగరాన్ని గురించి, అక్కడ నిర్మించబడుతున్న కొత్త భవనాలను గురించి ప్రసంగించాము.

"మా భవనాలకు, అమెరికాలో వుండే ఎత్తయిన భవనాలకు మధ్య మీకు చాలా భేదం కనుపిస్తూ వుండి వుండాలి. మీ భవనాలు చాలా సాదాగా, పెద్ద పెద్ద పెట్టెల్లాగా వుంటాయి" అన్నది మదాం గ్యూసీవ్.

వాళ్ళ భవనాలు పంచదార చిలకల్లాగా వుంటాయని సమాధానం చెప్పేదాన్నే. కాని, ఎందుకు లెమ్మని పస్తా యించాను. నే నేదో నిందారోపణ చేస్తున్నట్లుకూడా ఆమె భావించవచ్చు ననుకున్నాను.

నిజానికి, వారిలో ఎవ్వరూ అమెరికాకు ఒక్కసారి కూడా వచ్చిన పాపాన పోలేదు. మదాం విషిన్స్కీ మాత్రం తన భర్తవెంట ఒక్కసారి పారిస్ వెళ్ళింది.

శుభ్రమైన దుస్తులు ధరించిన బట్లర్ ఒకడు వచ్చి రష్యన్ ద్రాక్షసారాయి, కమ్మని కేవియార్ అనే పిండివంటను (దీనిని ఒకరకం చేపగుడ్లతో చేస్తారు), 'శాలడ్ శాండ్విచ్'లను (పచ్చడిని మధ్యపెట్టిన రెండేసి నాను రొట్టెముక్కలు) మాకు వడ్డించాడు. ఆ తరువాత టీ కాని, కాఫీ కాని ఎవరికి కావల

సింది వారికి ఇచ్చాడు. ఈ బట్లరు ఇంగ్లీషు అద్భుతంగా మాట్లాడాడు. మాకు వడ్డించిన పదార్థాలన్నిటినీ మేము చాలా సుకుమారంగా నంజటం ప్రారంభించాం. ఇంతలో మదాం గ్యుసీవ్ తన చిటికిన వేలుతో చాలా షోకుగా సౌంజ్ఞ చేసింది. వెంటనే బట్లర్ ఒకపళ్ళెంనిండా "పేస్ట్రీలు" (గోధుమ పిండి, వెన్న మొదలైనవాటితో చేసే పిండివంట) పట్టు కొచ్చాడు. వాటినికూడా కాస్త కాస్త నంజుకున్నాము.

"మీరు బేలెట్ నృత్యం చూశారా?" అని అడిగింది మదాం విషిన్‌స్కీ.

"లేదు. చూడాలనిమాత్రం ఎంతో అనుకుంటున్నాను. బేలెట్ ప్రదర్శనాలు సెప్టెంబరులో జరుగుతాయా?" అని అడిగాను.

"మీ అమెరికాలో అసలు బేలెట్ ప్రదర్శనాలు జరుగుతాయా?" అన్నది మదాం గ్యుసీవ్.

"ఓ, జరుగుతాయి. వీటిలో కొన్ని ప్రాచీన సంప్రదాయాలకు చెందినవి, మరికొన్ని నవీన సంప్రదాయాలకు చెందినవి; కాని, మీ దేశపు ఉత్తమ బేలెట్ నాట్యవేత్తలు కూడా అక్కడ ప్రదర్శనాలుజరిపితే చూడాలనుకుంటున్నాను. చాలాసంవత్సరాలకు పూర్వం, నాచిన్నతనంలో డయాఘిలేవ్ బేలెట్ నృత్యబృందం వారు న్యూయార్కు నగరానికిరావడం, వారి ప్రదర్శనాలు న్యూయార్కు ప్రజలను విశేషంగా ఆకర్షించడం నాకు గుర్తున్నది," అని సమాధానం చెప్పాను.

ఇక మళ్ళీ ఆమె నోరెత్తలేదు.

రష్యావాళితో మాట్లాడతగ్గ విషయాలు చాలా తక్కువగా వుంటాయి. వీరిని హఠాత్తుగా నిలవేసి, సంభాషణలోకి దించడం అట్టే భావ్యం కాదేమో ననిపిస్తోంది. ఎందువల్లనంటే, మనకంటె వీరిపైనే గూఢచారుల నిఘా ఎక్కువగా అమలుజరుగుతూ వుంటుంది.

మిగిలిన ముగ్గురుస్త్రీలు జాగ్రత్తగా పన్నాగం పన్ని మా సమావేశాన్ని సమాప్తిచేయించారు. ఆ ముగ్గురుస్త్రీలకు బట్లర్ కూడా తోడ్పడ్డాడు. అతడు రష్యా రహస్య పోలీసు శాఖలో కనీసం "జనరల్" హోదాగల ఉద్యోగి అయినా అయివుంటాడు!

బంట్రోతు తలుపు తెరిచాడు. మా రాయబార కార్యాలయపు కారువచ్చి ఆగింది. తిరిగి ఇంటికి బయలుదేరాను. నేను వచ్చేసిన తరువాత ఆ ముగ్గురు స్త్రీలు వాళ్ళలో వాళ్ళు ఏమనుకుంటూ వుంటారో వినగలిగితే ఎంత బాగుండునో అనుకున్నాను. మా కోసం తయారుచేయించిన పిండివంటలన్నిటిని మదాం గ్స్యసీవ్, మదాం జోరిన్‌లు ఊదేసి వుంటారని కచ్చితంగా చెప్పగలను.

జులై 30, 1949

మాస్కో నగరంలో ఒకమాసం పాటు ఉన్నమీదట, ఆ పట్టణాన్ని గురించి నాకు కలిగిన అభిప్రాయాలను క్రోడీకరిద్దామని ఇప్పుడు ప్రయత్నిస్తున్నాను. మాస్కోనగరం పనిపాటలతో వెల్లివిరుస్తూ వుంటుందనీ, నగరమంతటా జీవకళ తాండవిస్తూ వుంటుందనీ, నగరం సక్రమంగా అభివృద్ధి పొందుతూ వుంటుందనీ, చాలా కాలంపాటు జరిగిన

ఒక మహాయుద్ధ బీభత్సాన్నుంచి ప్రజలు కోలుకుంటూ వుండడం ఇక్కడ ద్యోతకమౌతుందనీ, నవప్రపంచాన్ని గురించి వారికిగల ఆశలకు, వారు కనే కలలకు ఈ నగరం చిహ్నమై వుంటుందనీ నేను భావించాను. కాని, ఇందుకు భిన్నంగా, ఈ నగరమంతా కళ కాంతి, తీరుపారు లేకుండా వుంది. భయంకరంగా, కొట్టవచ్చినట్లు కనుపించే క్రెమ్లిన్ కోటతప్పితే, ఇక్కడ సుందరమైన ప్రదేశంగాని, సుందరమైన భవనంగాని ఒక్కటికూడా లేదు.

స్కాండినేవియా, ఫిన్లండు మొదలైన దేశాలలో అక్కడివారి జాతీయాభిరుచికి ఉదాహరణలుగా చూపతగ్గ శిల్ప నిర్మాణాలు ఎన్నో వున్నాయి. కాని, రష్యాలోఅటువంటి వేవీ లేవు.

ప్రోకో ఫీఫ్ అనే సంగీత విద్వాంసుడు ఇతరుల ఆజ్ఞల ప్రకారం స్వరాలు అల్లడంకంటె నిశ్శబ్దంగా పడివుండటం శ్రేయస్కరమనుకున్నాడు. ఇలాగే, సోవియట్ కళా నియమాలను తానెందుకు ఉల్లంఘించవలసివచ్చిందో వివరిస్తూ గ్రంథాన్ని రచించిన షొస్టాకోవిచ్ గాని, ఫోటోగ్రాఫులోలాగా మక్కీకి మక్కీగా ప్రకృతిని, అవాస్తవికంగా వున్నప్పటికీ కంటికింపుగావుంటే చాలునని మానవచిత్రాలను చిత్రించే చిత్రకారులుగాని, బట్టలవర్తకుడు గుడ్డను కొలిచినంత సునాయాసంగా, బేళ్ళకుబేళ్ళు పుస్తకాలు వ్రాసే రచయితలుగాని– వీరిలో ఎవ్వరూ కూడా స్వకీయమైన ప్రతిభను, పనితనాన్ని ప్రదర్శించడానికి సాహసించ లేకుండా వున్నారు.

దుస్తుల విషయంలో కూడా ఇక్కడి వారికి అభిరుచి పూర్తిగా నశించిపోయినట్లున్నది. మొగవాళ్ళు తొడుక్కునే సూట్లు అతుకులబొంతలు. వాటిని ఉతికేందుకు సదుపాయాలు కొరగావడంవల్ల అవి శుభ్రంగానైనా వుండవు. ఆడవాళ్ళ దుస్తులు కేవలం సంచులులాగానే వుంటాయి—వీరు తొడిగేవి పొట్టిపరికిణీలు; వీటికి కింద అంచులు అతుకు పెట్టడంగాని, కుచ్చెళ్ళుగాని వుండవు. వీరి దుస్తులన్నీ—చివరికి చాలా ఖరీదైనవి కూడా—ఎంతో గళ్ళిగా వుంటాయి.

తూర్పు జర్మనీనుంచి పింగాణి సామానులు విరివిగా దిగుమతి అవుతున్నాయి. కాని, ఇక్కడి ప్రజల అవసరాలకు, ఆభిరుచులకు సరిపడడానికిగాను, జర్మన్ పింగాణీ పరిశ్రమ నాణ్యానంతా నాశనం చేయిస్తున్నారు. ఇలాగే మాస్కో నగరంలో ఎక్కడ ఏది చూసినా నిర్జీవంగా, విసుగుజనించే విధంగా వుంటుంది.

ఆగస్టు 3, 1949

మే మిక్కడికి వచ్చిన నాటినుంచీ ఎడతెరిపి లేకుండా ఒకటే వర్షం. నన్ను మార్కెట్టుకు తీసుకువెళ్ళవలసిందని బెల్జియం రాయబారి భార్య చాంటాల్ గోఫిన్‌ను అడిగాను. ఆమె రష్యన్ భాష చాలా బాగా మాట్లాడుతుంది. బెల్జియం ప్రజ లందరిలాగే చక్కగా ఇంటి పనులన్నీ చేసుకుంటుంది.

మేము పెద్దమార్కెట్టుకు వెళ్ళాము. పరిసర ప్రాంతాలలోని రైతులు, సమష్టి వ్యవసాయక్షేత్రాలలో

పనిచేసే కర్షకులు (కోల్ఖోజ్) వారు పండించిన వస్తువులన్నీ అక్కడికి తెచ్చి అమ్ముతారు. ప్రభుత్వానికి కర్షకులు చెల్లించవలసినదంటూ నిర్దేశించిన కోటాలు పోను, మిగిలిన దానిని వారు అమ్ముకొనడానికి రష్యాలో అనుమతి యివ్వబడుతుంది. అటువంటప్పుడు తాము పండించిన పంటలో కల్లా మంచి భాగాన్ని తమకే వుంచుకుని, మార్కెట్టులో తమ చిత్తం వచ్చిన ధరకు అమ్ముతూ వుండడం సహజమైన విషయమే.

కూరగాయలు కొల్లలుగా దొరుకుతూ వుండవలసిన ఆగస్టు మాసపు రోజు లివి. ఐనప్పటికీ, మార్కెట్టులో వున్నవల్లా దోసకాయలు, ముల్లంగిదుంపలు, కాబేజి, కొద్దిగా చచ్చు ఉల్లిపాయలు, చెదురుగా పార్స్నిప్‌గడ్డలు, కుక్కగొడుగులు మాత్రమే.

రష్యాలో సామాన్యులు—కార్మికులు, చిన్న చిన్న ఉద్యోగస్థులు—తినే ఆహారం ఈ విధంగా వుంటుందని చాంటాల్ చెప్పింది. ఉదయం 'కాషా' అనే అంబలి (పారిట్జ్) తాగుతారు. ఐతే ఇందులో పాలుగాని, పంచదారగాని ఏమీ వుండవు. మధ్యాహ్నంపూట, "సార్ క్రాతా" అనే మాంసం, ఇంకా ఇతరమైన రకాలు వేసి చేసిన పులుసు (సూప్), ఒక పెద్ద నానురొట్టె తింటారు. రాత్రిపూట మళ్ళీ నానురొట్టెనే మరింత తింటారు. ఆరగా ఆరగా టీ మాత్రం తాగుతారు. ఇక్కడ నానురొట్టెమాత్రం చాలా బాగున్నది. పాతకాలపు నల్లరొట్టె మొదలు, దాదాపు 'కేక్'లాగా వుండే తెల్లరొట్టె వరకు

ఇందులో చాలా రకాలరొట్టె లున్నాయి. ఈ నానురొట్టె అంతా ప్రభుత్వం నిర్వహిస్తున రొట్టెల కార్ఖానాలలో తయారవుతున్నది. ప్రభుత్వం ఆధ్వర్యాన నిర్వహించబడు తున్న షాపులలోనే ఈ నానురొట్టె అమ్మకమంతా జరుగు తున్నది.

నవంబరు 7 వ తేదీన, మే దినోత్సవంనాడు తప్పితే గోధుమపిండిని మరెన్నడూ అమ్మనే అమ్మరు. ఆ రెండు రోజులలోను రేషను ప్రకారం తన ప్రజలకు గోధుమపిండిని పంచిపెట్టడానికి "మహామహుడు, శ్రేయోభిలాషి అయిన బాపూ స్టాలిన్ ఉదారంగా అంగీకరించారు" అని పోస్టర్ల ద్వారా ప్రకటించబడుతుంది. ఈ విధంగా గోధుమపిండి ప్రజలకు లభించడంవల్ల, అదేదో తమకు బహుమానంగా లభించినట్లు వారు భావిస్తారు; అంతవరకు తాము గోధుమ పిండికై మొహం వాచామన్న విషయాన్నే మరచిపోతారు. సామానులను ఇళ్ళకు చేరవేసే బళ్ళు, కారులు మొదలైన ప్రయాణ సాధనా లేవీ ఇక్కడ వున్నట్లు కనుపించదు. చివరికి పరుపులు, తివాచీలు కూడా కొనుక్కున్నవారే వీధులవెంట మోసుకునిపోతూ వుంటారు. పురుషుల లాగనే స్త్రీలు కూడా అంతంత బరువైన సామానులను స్వయంగా మోసుకుపోతూ వుంటారు.

ఆగస్టు 15, 1949

శనివారం సాయంసమయం ఎంతో ఆహ్లాద కరంగా వుంది. ఎండ కూడా బాగా వచ్చింది. మా రష్యాదేశీయ వ్యవహారనిపుణుడు జార్జిమోర్గన్ నన్ను గోర్కీపార్కుకు

షికారు తీసుకువెళ్ళాడు. సాంస్కృతిక, విశ్రాంత్యుద్యాన వనాలు (Parks of culture and Rest) అని రష్యావారు చెప్పుకునే పార్కులలోకల్లా ఇదే పెద్దది. ఇంత ఆడంబర పూర్వకమైన పేరుతో పిలిచే ఈ పార్కులు కూడా కేవలం మన పబ్లిక్ పార్కులవంటివే! వాటికి వీటికి తేడా ఏమీ లేదు. సోవియట్ యూనియన్‌లో శనివారం కూడా సెలవు దినం కాకపోవడంవల్ల పార్కులో జనం అట్టేమంది లేరు. పిల్లలుమాత్రం బంతి ఆట ఆడుకుంటున్నారు. వారికంటె కొంచెం వయసుమీరిన కుఱ్ఱవాళ్ళు ఫుట్‌బాల్ ఆడుకుంటున్నారు.

అక్కడవున్న బహిరంగ చలనచిత్ర ప్రదర్శనం వైపు వెళ్ళాము. "సమష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసేవారి జీవన విధానం"—అనే సినిమా అక్కడ ప్రదర్శిస్తున్నారు. దానికి ఎదురుగా ఒక పఠనాలయం వుంది. దీనినిండా కమ్యూనిస్టు పార్టీ పుస్తకాలు, ఆపార్టీని గురించి ప్రచారం చేసే పత్రికలు తప్పితే మరేమీ లేవు. చదరంగం ఆడుకునేవారికి ప్రత్యేకంగా ఒక లతామంటపం కూడా ఆ పార్కులో వుంది. అక్కడ కొంతమంది ముసలివాళ్ళు బల్లలముందు వరుసగా కూర్చుని తదేకదీక్షతో చదరంగం ఆడుతున్నారు.

పార్కులో ఒక చిన్న కొలనుకూడా వుంది. రెండు మూడు పడవల్లో మాత్రం స్త్రీ పురుషులు ఆ కొలనులో షికారు చేస్తున్నారు. కొలను ఒడ్డున ఆరుబయటి కాఫీ హోటలు ఒకటి వుంది. అక్కడ మేము టీ తాగాము. (నిమ్మకాయముక్క ఒకటి కావాలన్నందుకు ఇక్కడ ఒక

రూబుల్ అదనంగా వసూలుచేశారు!) మా చుట్టుపక్కల కూర్చున్న వాళ్లంతా ఫలహారం తింటున్నారు — నానురొట్టె, మంచుతో చల్లార్చిన మాంసం, చేపల ఊరగాయ తిని వోడ్కా గాని, బీరుగాని, నిమ్మరసం సోడాగాని తాగుతున్నారు వాళ్ళందరూ. అసలు, వేళాపాళా లేకుండా రష్యనులు తిళ్లు తింటూ వుంటారల్లే వుంది. అంతేగాక, దేని తరువాత దేనిని తినాలి అనే విషయంలో కూడా ఒక క్రమవిధానం లేకుండా అడ్డదిడ్డంగా తింటూవుంటారు. ఉదాహరణకు: వేడివేడి 'హెర్రింగ్' చేపలకూరతో ఐస్‌క్రీం కలిపితినేస్తూ వుంటారు!

తన ప్రజలకోసం కామ్రేడ్ స్టాలిన్ ఈ పార్కును నిర్మించి, ఇందలి సదుపాయాలనన్నిటినీ సమకూర్చాడని అట్టలపైన వ్రాసి, వాటిని పార్కుగేటునుంచి లోపలికి వున్న దారివెంట అడుగడుగునా వుంచారు. అందువల్ల, అక్కడి పువ్వులను కోయవద్దనీ, గడ్డిపైన నడవవద్దనీ, చెత్త చెదారం వెదజల్లవద్దనీ, తను అందిస్తున్న సౌందర్యంవల్ల కేవలం అనుభూతిని మాత్రం పొందుతూ వుండమనీ ఆయన అక్కడికి వచ్చేవారిని కోరుతాడన్నమాట! ఈఅట్టలకుతోడు, చెట్లపైన, తదితరభవనాలపైన అమర్చిన లౌడ్‌స్పీకర్లనుంచి ఉపన్యాసాలు విధి విరామంలేకుండా వినిపిస్తూ వుంటాయి. వీటిలో చాలా భాగం రాజకీయోపన్యాసాలే. మధ్య మధ్య కాస్త సంగీతం కూడా వినిపిస్తూ వుంటుంది.

ఆగస్టు 18, 1949

ఆదివారంనాడు మేము పిక్నిక్ జరుపుకున్నాం. మాస్కో నగరానికి వెలుపల వున్న లెనిన్ గృహ పరిసర ప్రదేశాలను

తోటలను చూడడానికి ప్రజలకు అనుమతి ఇవ్వబడింది. మేము కూడా వాటినిచూసి రావడానికై మాస్కో-నదిలో ప్రయాణం చేసి వెళ్లాము.

కొత్తగా మాకు రాయబార సలహాదారుగా నియమితుడైన వాలీ బార్బర్ కూడా మా వెంట వున్నాడు.

వారానికి నాలుగు రోజులపాటు సాయం సమయాలలో ప్రజలు ఆ సమాధిని చూచిరావచ్చు. ఆ సమాధిని చూచి రావడానికై ప్రజలు ఎండ, వానలనుకూడా లెక్క-చేయకుండా ఎప్పుడూ బారులుతీరి నిలబడి వుంటారు. ఒక్కొక్క-ప్పుడు ఈ వరుస నాలుగు ఇళ్ళ అవతలదాకాకూడా వుంటుంది. కాని, సమాధిని చూడనివ్వడం ప్రారంభ మయిందంటే ఈ వరుస త్వరితగతినే ముందుకు జరుగు తుంది. ఎందువల్లనంటే, పోలీసువాళ్ళు ఆ వరుసలో ఎవ్వరూ జాగుచేయకుండా, ఒక క్రమవిధానంలో నెమ్మదిగా ప్రవర్తిం చేటట్లు చూస్తూ వుంటారు.

లెనిన్ భౌతిక దేహం వుంచబడిన గదిని మేము చేరుకుంటున్న కొద్దీ గాలి చల్లగా అవుతున్నట్లు అనిపించడం ప్రారంభమయింది. ఈ గదినెప్పుడూ నీరు గడ్డకట్టే శీతోష్ణ స్థితిలో వుంచుతారు. గదికి మధ్యభాగంలో వేదికపైన లెనిన్ భౌతిక దేహ ముంది. ఆపైన అంతా ఒకగాజు పేటిక ఏర్పాటు చేయబడి వుంది. గుండెలవరకు ఆయనపైన నల్లటి ముఖమల్ దుప్పటి ఒకటి కప్పివుంది. ఆయన చేతులు ఆయనకు పక్క-గా ఇరువైపుల బారజాపి వున్నాయి. ఆయన తలక్రింద నల్లరంగు శాటిన్ తలగడా వుంది. విచిత్రమైన విద్యుద్దీప విధానాన్ని

లోపల ఏర్పాటుచేశారు. అందువల్ల ఆయన ముఖంలోనుంచి తేజస్సు వెలువడుతున్నట్లుంటుంది. లేత పసుపురంగు కాంతితో ఆయన వదనం ప్రకాశిస్తూ వుంటుంది. ఆయన నల్లని సూటు, కాలరు, నెక్‌టై ధరించాడు. ఆయన శిరోజాలు, గడ్డం చాలా శుభ్రంగా కత్తిరించినట్లు కూడా కనుపిస్తున్నాయి.

బ్రిటిష్ రాయబారి సలహాదారుడు జెఫ్రీ హారిజన్ ఇంతకు పూర్వం లెనిన్ సమాధికి వెళ్ళినప్పుడు లెనిన్ చేతులకు "గ్లవ్స్" (చేతులకు తొడుక్కునే మేజోళ్ళు) వుండటం చూచానని అన్నాడు. కాని, అటువంటి వేమీ మొన్న మేము వెళ్ళినప్పుడు లేవు.

ఆగస్టు 21, 1949

స్టాలిన్ నాభర్తను కలుసుకోనవలసిన సమయం రాత్రి పదిగంటలకు నిర్ణయించబడింది. జార్జి మోర్గన్‌తో బాటు వాలీ బార్బర్ కూడా నా భర్తవెంట క్రెమ్లిన్‌కు వెళ్ళవలసి వుండటంవల్ల ఆయనకూడా మాతోపాటు ఇక్కడే భోజనం చేశాడు. జాగ్రత్తగా నిర్ణయించుకున్న ప్రకారం, పదిగంటలకు పదినిమిషాలున్నదనగా వారు ముగ్గురూ బయలుదేరి వెళ్లారు.

వాళ్ళు తిరిగి వచ్చేసరికి దాదాపు పదకొండుగంట లయింది. ముప్పై ఏడు నిమిషాలసేపు అక్కడున్నా రన్నమాట—అంటే, బ్రిటిష్ రాయబారి జరిపిన ఇంటర్వ్యూ కంటె పన్నెండు నిమిషాలసేపు ఎక్కువ! అంతేగాక, వారి ముఖాలలో సంతృప్తికూడా ద్యోతకమాతున్నది.

క్రెమ్లిన్‌లో అంగరక్షకులు అనేకమంది ఒకరి తరువాత మరొకరుగా వారికి దారిచూపించారు. అడుగడుగునా కాపలా

దారులు నిల్చివున్న నడవాలగుండా వారిని తీసుకుపోయి;
చివరికి ఒకగదిలో కూచోపెట్టారు. ఆ గదిలో చెప్పుకోనతగ్గ వస్తుసామగ్రికూడా ఏమీలేదు. ఎవరైనావస్తే కూర్చోవ డానికిగాను ఒకబల్ల, కొన్ని కుర్చీలుమాత్రం వున్నాయి. వీరు వెళ్ళగానే పరామర్శించడానికిగాను మార్షల్ స్టాలిన్ లేచినిలబడి, నా భర్త దగ్గరకు వచ్చి, కరచాలనం చేసి, కూర్చోమని కోరాడు. ఆయనతోబాటు విషిన్‌స్కీ, ఆయన దగ్గర దుబాసీగా పనిచేస్తున్న ట్రోయానోవ్‌స్కీలుకూడా వున్నారు. ట్రోయానోవ్‌స్కీ యువకుడు; ఇతడితండ్రి పూర్వం అమెరికాలో సోవియట్ రాయబారిగా పనిచేశాడు.

ప్రారంభదశలో సంభాషణ కొంచెం పెడసరంగా జరిగినా, ఆపైన మాత్రం స్నేహపూర్వకంగానే జరిగిందని నా భర్త చెప్పారు. మార్షల్ స్టాలిన్ తన హుక్కా అందుకుని, వెలిగించుకున్నాడట కూడా. (స్టాలిన్ అత్యంత స్నేహ పూర్వక వైఖరి అవలంబించాడనడానికి అది నిదర్శనమని పత్రికా ప్రతినిధులు ఆ తరువాత నా భర్తతో అన్నారు.) వాయిస్ ఆఫ్ అమెరికాతో సహా, సాధారణ విషయా లన్నిటిని గురించీ వాళ్ళు చర్చించారు.

వాయిస్ ఆఫ్ అమెరికా విషయం ప్రస్తావించినప్పుడు, స్టాలిన్, విషిన్‌స్కీ వైపు తిరిగి నవ్వుతూ "వాళ్ళు మన్ని గురించి దుష్ప్రచారం చేస్తున్నారా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు విషిన్‌స్కీ కొంత తడబడ్డాడని నా భర్త చెప్పారు. ఇంటర్వ్యూ ముగియగానే, స్టాలిన్ స్నేహపూర్వ

తంగా నా భర్తతో కరచాలనం చేస్తూ, మళ్ళీ మరొకసారి ఎప్పుడైనా కలుసుకుంటే సంతోషిస్తానని అన్నాడట.

సోవియట్ పద్ధతులనుబట్టి చూస్తే మార్షల్ స్టాలిన్, రష్యా విదేశాంగ మంత్రి విషిన్‌స్కీలు ఇద్దరూ మొత్తంమీద ఎంతో సరసంగానే ప్రవర్తించారని మా వాళ్ళు ముగ్గురూ భావిస్తున్నారు.

ఆగస్టు 29, 1949

మొఖొవాయా స్క్వేర్ వద్ద పనిచేస్తున్న స్త్రీలను చూస్తున్నాను. వారు రోడ్డును బాగుచేస్తున్నారు. తారు కలిపిన నల్లటి కంకరను రోడ్డునిండా పోసి, రోడ్డు బాగుచేసే యంత్రంతో దానినంతా చదునుచేస్తున్నారు. ఈ యువతులంతా నూలు పరికిణీలు, జాకెట్లు ధరించారు. రుమాళ్ళు తలలకు చుట్టారు. కాళ్ళకు ముతకరకం నూలు మేజోళ్ళు, కాన్వాసు బూట్లు తొడిగారు. ఈ కాన్వాసు బూట్లకు వేడి వేడి తారు కంకర ముద్దలు ముద్దలుగా అతుక్కుపోతున్నది. రైళ్ళలో ప్రయాణం చేస్తున్నప్పుడు మాత్రమే రష్యాలో స్త్రీలు ఎవరైనా లాగులు ధరించగా నేను చూచాను. గడ్డు శీతా కాలంలో కూడా రష్యన్ స్త్రీలు "స్కీ" లాగులు తొడుక్కొని వీధులలో తిరగరని మా రాయబార కార్యాలయోద్యోగుల భార్యలు చెప్పారు.

రోడ్డుబాగుచేయడం మురికిపనుల్లో ఒకటి. ఇది చాలా శ్రమకోర్చవలసిన పని కూడాను. కాని, ఈ రష్యన్ స్త్రీలు చేయలేని మొరటుపని అంటూ ఈ పృథ్విలో లేనేలేనట్లుంది. వాళ్ళు మోసేపనిలోను, మోటారులారీల్లోనుంచి సామానులు

దించే పనిలోను, తవ్వే పనిలోను, తోపే పనిలోను. ఇళ్ళకి రంగులు వేసే పనిలోను—ఎక్కడ పడితే అక్కడ ఇటువంటి వాళ్ళే కనిపిస్తారు.

మాస్కో నగరం చూడాలని ఉబలాటపడే గ్రామీణ బాలికల సందరిసీ సమీకరించి. కాయకష్టం చేస్తామనే ఒప్పందాలపైన సంతకాలు చేస్తేనే వారు మాస్కోకు వెళ్ళడానికి వీలుంటుందని చెప్తున్నారట. ఇలాంటి ఒప్పందాలకు వచ్చే బాలికలలో చాలామందికి పెద్ద చదువు సంధ్య లేమీ లేవు. అటువంటప్పుడు వారు చేయగలిగింది కూడా మరేమీ లేదు. కాని, వారలా కంకర రాళ్ళ మోతతో సత మత మవడం చూస్తూవుంటే కడుపు తరుక్కుపోతుంది. పని అయిపోగానే మోటారులారీ లొస్తాయి. వారంతా వాటిలో ఎక్కి వెళ్ళిపోతారు. ఐతే, వారి నెక్కించుకుపోయే కారులను కూడా అంతకుపూర్వమే సిమెంటు బస్తాలు, గోధుమపిండి బస్తాలు వగైరా సామానులతో నింపివేస్తారు. ఆ సామానుల మధ్యనే వారు కూడా ఎలాగో సర్దుకుని కూర్చోవాలి. సిద్ధాంతరీత్యా ఇది అందరికీ 'సమానావకాశాలున్న దేశం' కావచ్చు; కాని, ఇటువంటి సమానావకాశాలలో ఎక్కువ స్త్రీలకే వున్నాయి!

మరి, వారి ఆరోగ్యం మాట ఏమిటని ఎవరైనా ఆశ్చర్యపడక తప్పదు. అలాంటి మొరటుపనులు చేయడంవల్ల ఆరోగ్యం తప్పక చెడుతుంది. చాలా సంవత్సరాల నుంచీ ఇక్కడ వుంటున్న ఒక పత్రికా విలేకరిని ఈ విషయమై ప్రశ్నించాను.

"ఔను, వారి ఆరోగ్యం చెడిపోతుంది. ఆ బాలికల కోసమై ప్రత్యేకంగా ఆసుపత్రులున్నాయి. మొదట్లో వాళ్ళు బలంగానే కనుపిస్తారు. కాని, ఇవటుంటి మొటుకుపనులు ఒకటి రెండు సంవత్సరాలపాటు చేసేసరికి వారి ఆరోగ్యం అంతా నాశనమైపోతుంది. ఏదో విధంగా స్వస్థత చేకూర్చడానికై ఇటువంటి వారిని వందలకొద్దీ మందిని ఈ ఆసుపత్రులకు పంపుతూవుంటారు. ఇలా పంపిన వారిలో, పనిచేయడానికి పూర్తిగా తగనివారు ఎవరైనా వుంటే, వారిని వారి యిళ్లకే పంపివేస్తారు" అని తెలియజేశాడు ఆ పత్రికావిలేకరి.

ఒక రష్యన్ ఆసుపత్రిని—దేనినైనా సరే—చూచి రావడానికి అనుమతివ్వవలసిందని రష్యన్ అధికారులను నేను కోరాను. కాని, అందుకు నాకు ఇంతవరకు సమాధానమేమీ రాలేదు. ఏదైనా ఒక పాఠశాలను, ఒక బాలమందిరాన్ని (Nursery) చూచి రావడానికి కూడా అనుమతించవలసిందని సోవియట్ అధికారులను కోరాను. కాని వీటిలో ఏ ఒక్క దానికీ కూడా ఏ విధమైన సమాధానమూ రాలేదంటే నమ్మండి.

రష్యా విదేశాంగ కార్యాలయంలో పనిచేస్తున్న ఉద్యోగి భార్య ఒకావిడ ఇటీవల నన్ను చూడడానికి వచ్చింది. అప్పటినుంచీ, రష్యన్ ఆసుపత్రి ఎలా వుంటుందో చూడాలని నాకు చాలా ఆసక్తిగా వుంది. ఈ యువతి చాలా బక్క పలచగాను, అందంగాను వుంది. మాస్కోనగరంలో కల్లా అత్యంత ఆధునిక సదుపాయాలు గల స్త్రీల ఆసుపత్రిలో ఈమె నిరుడు పురుడుపోసుకున్నది. కాన్పుకి పూర్వం ప్రతినెలా

ఆసుపత్రికి పోయివస్తూ వుండేది. కాని, అక్కడ ఈమెను సరిగా పరీక్షిస్తామన్నవారే లేకపోయారు. ఆసుపత్రిలో చేర్చ డానికై తన భర్త వెంటపెట్టుకు వెళ్లినప్పుడు ఈమె భయపడి పోయింది.

నొప్పులు ప్రారంభమయ్యేవరకు ఆసుపత్రిలో చేర్చుకొన డానికి వీలులేదని అక్కడ ఈమెకు చెప్పారు. అంతవరకు ఈమె యింటిపట్టునగాని,మరెక్కడైనాగాని వుండవలసిందే నన్నారు. తన కిది నాలుగవ కాన్పు కావడంవల్ల తనను ఆసుపత్రిలో చేర్చుకొనక తప్పదని ఈమె పట్టుపట్టింది. చివరికి వారు ఒప్పుకుని ఒక ఇరుకుగదిలో పెట్టి, పురుడు వచ్చే రోజువరకు అక్కడే పెట్టారు.

తరువాత ఈమెను ఒక హాలుగుండా పురిటిగదికి తీసుకు వెళ్లారు. పురుటి నొప్పులు పడుతున్నవారు ఇంకా అక్కడ పధ్నాలుగుమంది వున్నారు. ఏరంతా ఒకరికొకరు కనుపిస్తూనే వున్నారు! మంత్రసానులు తగినంతమంది లేరని చెప్పి ఈ విధానాన్ని సమర్థించడానికి ప్రయత్నిస్తున్నారు!

నీకు మత్తుమందు ఏదైనా యిచ్చారా అని ఈమెను నేను అడిగాను.

"అబ్బే... లేదు, కాన్పులుచేయడానికి వారవలంబించే పద్ధతి అంతకంటె చాలా మొరటుగా వుంటుంది. ఆ డాక్టరుకు తగ్గట్టుగానే నా ప్రసవంకూడా ఏ వేళకూ తెమలకపోయింది. చివరకు డాక్టరు విసుగెత్తి 'ప్రసవం జరిగేటట్లుగా నీకు నువ్వు చూడలేకపోతే, నేను ఆసరా రావలసి వస్తుంది. గట్టిగా శ్వాస ఎగపీల్చి పది లెక్కపెట్టు!" అన్నది.

ముందు ఏమి జరగనున్నదో తెలుసుకోలేని ఈ అమాయకురాలు పాపం అలాగే చేసింది. బలవంతాన కాన్పు రప్పించడానికిగాను, నూటఅరవై పౌనుల బరువున్న పర్వతం లాంటి ఆ డాక్టరు కాస్తా అమాంతంగా ఈ అర్భకురాలిపై పడింది.

బిడ్డ బయటికి రాగానే, తల్లిని బిడ్డను చిన్న వార్డులోకి మార్చారు. ఆ తరువాత బాలింతరాలుపట్ల వారుచూపిన శ్రద్ధ కూడా ఇంత మొరటుగానే వుంది. ఇక్కడ బయటినుంచి ఆసుపత్రిలోనికి ఆహారాన్ని తెప్పించుకోనివ్వరు. దీనికితోడు ఈవిడకు ఉచితంగా ఆసుపత్రిలో ఇచ్చిన ఆహారం దుర్భరంగా వుండేది. ఇంతకీ, ఈ పరిస్థితులన్నీ మాస్కోలోని ప్రధానమైన స్త్రీల ఆసుపత్రిలోనివన్న విషయం గుర్తుంచు కోండి.

రష్యన్ ఆసుపత్రిలోని వైద్యసదుపాయాలను ఉపయో గించుకోనడానికి మా రాయబారకార్యాలయపు డాక్టరుకు అనుమతి లభించలేదు. ఆయన స్వంతబాధ్యతపైన, మా స్వంతబాధ్యతలపైన, ఆయన మాకు చికిత్స చేయవచ్చు. కాని, ఇక్కడి ఆసుపత్రి సదుపాయా లేవయినా కావలసి వస్తే మాత్రం ఆయన రోగులను 'పోలీ క్లినిక్'కు పంపవలసి వుంటుంది. విదేశ రాయబార కార్యాలయోద్యోగులను చేర్చుకునే ఆసుపత్రి అదొక్కటే. అక్కడ ఆ రోగిని ఒక డాక్టరుకు అప్పగిస్తారు. ఇక అప్పటినుంచీ ఏ విషయమూ రోగి యిష్టప్రకారం జరగదు. రష్యాలో ఆసుపత్రి సౌకర్యాలు ఉచితంగా లభిస్తాయని వినికిడి. కాని, గదికీ,

భోజనానికి, చికిత్సకుగాను మొత్తంమీద మామూలుగా రోజుకు 45 డాలర్లు చొప్పున మావద్ద వసూలుచేస్తున్నారు.

ఐతే, ఇందాకటి స్త్రీ అనుభవానికి భిన్నంగా— రష్యన్ డాక్టర్ల చికిత్సావిధానం చాలావరకు మంచిదేననీ, కాని, ఆసుపత్రులలో సాధనసామగ్రిమాత్రం చాలా తక్కువగా వుందనీ, వైద్యులు చికిత్సచేసే తీరు మొరటుగా వుంటుందనీ, ఆక్షణాన ఏమితోస్తే ఆ పద్ధతిని వారు చికిత్స చేస్తారనీ మా డాక్టరు చెప్పాడు.

గతసంవత్సరం వసంతకాలంలో, డచ్ రాయబారి సలహాదారుడు ఆంత్రప్రదాహరోగం (Ruptured Appendix) తో బాధపడ్డాడు. ఆ రాత్రికి రాత్రే ఆయనను రష్యన్ ఆసుపత్రికి తీసుకుపోయారు. ఇద్దరు స్త్రీలు ఆయనకు ఆపరేషన్ చేశారు. ఈ ఆపరేషన్ చేయడానికి గంటన్నరసేపు పట్టింది. ఈ ఆపరేషన్ చేస్తున్నచోట మాత్రమే ఆయన శరీరం కొయ్యబారటానికి మత్తు మందు ఇవ్వబడింది. ఈమత్తు మందు ప్రభావానికి ఆయనలోనై వున్నది కూడా ముప్పావు గంట సేపు మాత్రమే.

నొప్పిగావుండి, ఆయనమూలిగితే, కదలకుండా పడుకుని విశ్రాంతితీసుకోమని చెప్పారు డాక్టర్లు! "పుష్కిన్ కవి రాసిన గేయాలు లోలోపల వల్లించుకో!" అన్నారు మరొకరు. ఆయన్ను తీసుకుపోయి కాళ్లుచేతులు బెల్టులతో కట్టివేయమని ఆ డాక్టర్లు నర్సులకు పురమాయించి, ఆపరేషన్ ప్రారంభించారు.

తరువాత నెమ్మదిగా కోలుకుంటున్న రోజుల్లో, అమెరికన్ ఫాషన్ మాగజీన్లు తెచ్చిపెట్టమని ఆయన తన

మిత్రులను అడుగుతూ వుండేవాడట. కొద్దిరోజులుకల్లా, మిగతా వార్డు లన్నిటిలోను పనిచేస్తున్న నర్సు లందరూ వచ్చి ఆయనచుట్టూమూగి, ఆ పత్రికలలో బొమ్మలుచూడ నివ్వవలసిందని బ్రతిమాలేవారట. ఈ విషయాన్ని కూడా ఆయనే చెప్పాడు.

సెప్టెంబరు 3, 1949

మాస్కోనగరమంతా మళ్ళీ ప్రశాంతంగా వుంది. వేసవి మకాములు చేయడానికి వెళ్ళిన విద్యార్థిబృందాలు తిరిగి రావడంతో నిన్ననల్లా మాస్కోనగరం అంతా ఒక పెద్ద రైలుస్టేషన్‌లాగా వుంది. ఎక్కడచూసినా బడిపిల్లలే.

ఏదైనా ఒక పాఠశాలను చూసివద్దామంటే నాకు వీలుచిక్కలేదు గనుక (నా ఉత్తరానికి ఇంతవరకు ఏ విధమైన సమాధానమూ రాలేదు) మా యింట్లో పనిచేస్తూన్న మనిషిని, తనపిల్లలు చదువుకుంటున్న రెండుస్కూళ్ళను గురించి చెప్పమని అడిగాను. ఇక్కడ ఏడవ సంవత్సరం ప్రవేశించినప్పటినుంచీ పిల్లలు బడికి వెడతారనీ, అప్పటినుంచీ మామూలుగా ఏడేళ్ళపాటు బడిలో చదువుతూ వుంటారనీ ఆమె చెప్పింది. పెద్ద పెద్ద నగరాలకు వచ్చి కాపురం వుండాలని పిల్లలున్నవారు కోరుకొనడానికి ఇది మరొక కారణం. తమ పిల్లల చదువుకు ఇంకా మంచి అవకాశాలు ఇటువంటి నగరాలలో వున్నాయి గనుక వారు ఇక్కడికి రావాలనుకుంటారు. హైస్కూలు తరగతులకు విద్యార్థులను చేర్చుకొనడం అనేకవిధాలుగా జరుగుతుంది; కొందరిని వారికి గల తెలివితేటలనుబట్టి చేర్చుకుంటారు; మరికొందరిని కమ్యూ

నిష్టుపార్టీ పలుకుబడినిబట్టి చేర్చుకుంటారు. సామాన్యమైన మార్కులు వచ్చినవారిని, అంతకంటె తక్కువమార్కులు వచ్చినవారిని వృత్తి పాఠశాలలో చేరవలసిందని సలహా నిస్తారు; కళల్లో ప్రత్యేకమైన తెలివి తేటలను ప్రదర్శించిన కొద్ది మందినిమాత్రమే ఆ చదువును ఇంకా కొనసాగించనిస్తారు.

యుద్ధసమయంలో తల్లిదండ్రులను కోల్పోయిన బాలురలోనే కొందరిని, కొత్తగా స్థాపించబడిన నౌకా పాఠశాలలో 'కేడెట్లు'గా తీసుకున్నారు. ఇటువంటి అనాథ బాలురు ఏ విధమైన భావబంధాలుగాని, కుటుంబ సంబంధాలుగాని లేకుండా సిసలైన కమ్యూనిష్టు పార్టీ సేవకులుగా తయారుకాగలరు గనుక, వీరికే ప్రత్యేకమైన సౌకర్యాలు కల్పించబడుతున్నాయి.

ఈ పిల్లలందరి ఆరోగ్యం బాగానే వున్నట్టున్నది. కాని ఈ విషయమై నిస్సందేహంగా చెప్పడానికి వీలులేదు. ఎందువల్లనంటె, దేశంలో క్షయవ్యాధితో బాధపడుతున్న వారి లెక్కలుగాని, కీళ్ళవాత జ్వరంతో బాధపడుతున్నవారి లెక్కలుగాని లేవు. నిజానికి సామాన్య ప్రజలకు సంబంధించిన ఏ విధమైన లెక్కలు రష్యాలో లేనేలేవు. ఈ పిల్లలు బొద్దుగా కనుపించరు. వీరిలో చాలామంది వారి తల్లితండ్రులలాగానే పాలిపోయినట్లుగా కూడా వుంటారు. కాని వీరంతా మొత్తంమీద దేహదార్ఢ్యం కలవారేనని చెప్పవచ్చు.

సెప్టెంబరు 30, 1949

ఎలాగైతేనేమి మేము క్రెమ్లిన్‌కు కూడా వెళ్ళి వచ్చాం. ఇక్కడకు వెళ్ళడానికి పూర్వం రష్యన్ కళను

గురించి, రష్యా చరిత్రను గురించి కొంత తెలుసుకోవాలను కున్నాను. అందుకు వీలుగా, క్రెమ్లిన్‌ను చూచి వచ్చేటందుకు అనుమతి ఇంతకు పూర్వమే లభించకుండా కొంచెం వ్యవధి వారికినందుకు సంతోషించాను. క్రెమ్లిన్ చూచి రావాలను కుంటే అందుకు చాలా రోజులుముందుగా సోవియట్ అధికారుల అనుమతిని కోరాలి. ఎవరెవరు కలిసి వెడతారో వారి పేర్ల జాబితాను రష్యా విదేశాంగ కార్యాలయం వారికి పంపాలి. రష్యాలోని పురావస్తు ప్రదర్శనాలయాలను చూచి రావడానికి రష్యన్ ప్రజలకే అనుమతి లేదు. క్రెమ్లిన్ ఆవరణలోనికి కూడా ప్రజలుపోయి చూచి రావడానికి వీలులేదు. ఇక్కడ అంతా కాపలాదారుల నిఘా విపరీతంగా వుంటుంది.

మమ్మల్ని అందర్నీ నా భర్త కారులో తీసుకువెళ్లారు. క్రెమ్లిన్ గేటుగుండా మా కారుపోవడానికి అనుమతించారు. అనధికార పూర్వకంగా క్రెమ్లిన్‌కు వచ్చే వారందరూ లోపలికి నడిచిపోవలసి వుండడం పరిపాటి. అరవై అడుగుల ఎత్తున వుండే ఆ క్రెమ్లిన్ ప్రాకారాలను బయటినుంచి ఇంతకు పూర్వం ఎన్నోసార్లు చూచాను. అందువల్ల, ఆ గేటుగుండా ఆ ప్రాకారం లోపలికి వెడుతూ వుంటే, ఒక విధమైన ఆవేశాన్ని పొందాను.

ఇంతలో మాకొక మార్గదర్శిని (గైడ్) ఎదురయింది. ఆవిడ రష్యా విదేశాంగ కార్యాలయ ప్రతినిధి. గోధుమరంగు యూనిఫారం ధరించి వున్న దామె. నా భర్త వెంట వున్న రష్యా రహస్య పోలీసులు నలుగురితోపాటు మరి ముగ్గురు

కూడా ఇచ్చి, మేము క్రెమ్లిన్‌లో వున్నంతసేపు వారు కూడా మా వెంటనే వున్నారు.

క్రెమ్లిన్ లోపలి భవనాలు, బహిరంగ ప్రదేశాలు అన్నీ కూడా ఎంతో పరిశుభ్రంగాను, వికాసవంతంగాను వున్నాయి. సోవియట్ యూనియన్‌లోకల్లా నాకు కనుపించిన చక్కని ప్రదేశం ఇదొక్కటే. నిజానికి, దీనిని చాలా బాగా వుంచుతున్నారు.

క్రెమ్లిన్ మధ్యనున్న చౌకుదగ్గరకు మమ్మల్ని తీసుకు వెళ్ళింది. దానిచుట్టూ మూడు పెద్ద పెద్ద చర్చీ లున్నాయి. చౌకుమధ్యలో ఇవాన్ వెలికీ నిర్మించిన టవర్ వుంది. టవర్‌పైన పెద్దగంట కూడా వేళాడుతున్నది. ఇక్కడి చర్చీలను బాగు చేస్తూన్నారు. అందువల్ల మమ్మల్ని వాటి లోపలికి వెళ్ళనివ్వలేదు.

మా గైడ్ మాకు జార్ చక్రవర్తి ఫిరంగిని చూపించి, ఇది ప్రపంచంలోకల్లా పెద్దఫిరంగి అని గర్వంగా చెప్పింది. ఐతే, దానిని ఎన్నడూ పేల్చటం జరగలేదని కూడా ఆమె ఒప్పుకున్నది. ప్రపంచంలోకల్లా పెద్దగంటను కూడా ఆమె అంత గర్వంతోనే మాకు చూపించింది; ఆ గంటను ఎన్నడూ మోగించిలేదని కూడా ఆమె అలాగే ఒప్పుకున్నది!

మేము అక్కడ చూడటానికి వీలున్నదంతా చూచిన తరువాత, మా గైడ్ మాకొక చిన్న ఉపన్యాసమిచ్చింది. జార్జి మోర్గన్ దానిని అనువదించి ఇలా చెప్పాడు: "ఒకనాడు జార్ చక్రవర్తుల ఆస్తిగా వున్న ఇదంతా

ఈనాడు రష్యా ప్రజలది. పరిరక్షించుకోనడానికి, అనుభవించడానికి ఈ ఐశ్వర్యమంతా ఈనాడు వారిదే."

దీని పరిరక్షణ జరుగుతున్నమాట ముమ్మాటికీ నిజమే కాని, ప్రజలుమాత్రం అనుభవిస్తూన్న దేమీ లేదు. ఇవ్వాళ క్రెమ్లిన్ చూడవచ్చింది మేముమాత్రమే. బహుశా, నెలకు యాభై మందిని మించి ఈ ప్రదేశాన్ని ఎన్నడూ చూడనివ్వరేమో. అదైనా కొంత కొంత మందిని మాత్రమే చూడనిస్తారు. ఇటువంటివారు సాధారణంగా విదేశస్థులై వుంటారు. క్రెమ్లిన్ చూడటం సోవియట్ ప్రజల హక్కుగా సోవియట్ అధికారులు భావించరు. ఒక ప్రత్యేకమైన అవకాశమివ్వడంగా భావిస్తారు.

నవంబరు 6, 1949

రేపు, నవంబరు 7 వ తేదీన విప్లవ వార్షికోత్సవం జరపడానికై మాస్కోనగరమంతా కోలాహలంగా వుంది. ఎక్కడపడితే అక్కడ ఎఱ్ఱజెండాలు తగిలిస్తున్నారు. ప్రతిషాపు కిటికీలలోను లెనిన్, స్టాలిన్‌ల పటాలు తగిలిస్తున్నారు. భవనా లన్నిటిముందు లెనిన్, స్టాలిన్ చిత్రాలు బ్రహ్మాండమైన సైజువి నిలబెట్టారు. రెడ్‌స్క్వేర్ యావత్తు రంగురంగులతో దేదీప్యమానంగా వుంది. లెనిన్ సమాధికి ఎదురుగా వున్న భవనాలన్నీ ఎఱ్ఱజెండాలతో పూర్తిగా కప్పబడిపోయాయి. లెనిన్ సమాధికి కూడా కొందరు స్త్రీలు భక్తిపూర్వకంగా మెరుగులు దిద్దుతున్నారు. ఐతే, సెక్యూరిటీ పోలీసులుమాత్రం వారిని వెయ్యికళ్ళతో కాపలా కాస్తూనే వున్నారు. లెనిన్ సమాధిపైకి కమ్యూనిష్టు పార్టీ

ప్రముఖులు నడిచివెళ్ళే మెట్లపైన తివాచీలు పరిచారు. వారంతా అక్కడ స్టాలిన్ చుట్టూ నిలబడి సైనికప్రదర్శనాలను పరిశీలిస్తారు.

నవంబరు 7, 1949

ప్రొద్దున్న ఎనిమిదిగంటలకల్లా ఫలహారం తీసుకుని, మొఖోవాయా భవనానికి పెందరాడే చేరుకుందామని తొమ్మిదిగంటలకల్లా యింటినుంచి బయలుదేరాం. నేను నా పెద్ద జూలుకోటు తొడిగాను. ఈ కోటు తొడిగితే నేను చాలా ఠీవిగా వున్నాననిపిస్తుంది నామటుకు నాకు.

మా ఆనవాలు కార్డులు, ప్రవేశానుమతిపత్రాలు పరీక్షించడానికిగాను రష్యన్ అధికారులు మమ్మల్ని మూడుసార్లు నిలవేశారు. చివరికి, నా భర్త వెంట వున్న రష్యా రహస్య పోలీసులు కూడా వాటిని చూపించవలసి వచ్చింది. ఖాకీరంగు ఉన్ని యూనిఫారాలు, నీలిరంగు టోపీలు ధరించిన సెక్యూరిటీ పోలీసులు ఆ సువిశాలమైన ఖాళీస్థలం చుట్టూ భుజాలు భుజాలు రాచుకుంటూ దడికట్టినట్లు నిలబడి వున్నారు. మేము వారిని తప్పించుకువెళ్ళి, లెనిన్ సమాధికి ఎడమవైపున వున్న రాతిబెంచీలపైన ముందువరసలో కూర్చున్నాము.

రెడ్ స్క్వేర్‌లో సరిగ్గా ఆవలవైపున రెడ్ ఆర్మీ నివహాలు అప్రమత్తస్థితిలో వున్నాయి. క్రెమ్లిన్‌లో గడియారం పదిగంటలుకొట్టింది. నల్లని ఓవర్‌కోటులు, టోపీలు ధరించిన పోలిట్‌బ్యూరోసభ్యులు వరుసగా ప్రక్కగేటులోనుంచి బయటికి వచ్చి, లెనిన్ సమాధిపైకి మెట్లెక్కి బారులుతీరి

నిలబడ్డారు. యుద్ధమంత్రి కూడా వచ్చి వారితో బాటు నిలబడ్డాడు. సైనికవందనం జరుగుతూ వుండగా ఫిరంగి కాల్పులతో భూమి దద్దరిల్లింది; మిలిటరీ బ్యాండువాయిస్తున్న జాతీయగీతంతో చెవులుగింగురు మన్నాయి. పోలిట్ బ్యూరో సభ్యులు తప్ప మిగిలిన ప్రతి ఒక్కరు సైనికులకు ప్రతివందనం చేస్తున్నట్లు తమ టోపీలను పైకెత్తారు — తమను తామే దీవించుకోనగూడదన్న భావమే పోలిట్ బ్యూరో సభ్యులు తమ సైన్యానికి ప్రతివందనం చేయకపోవడానికి కారణమైవుండవచ్చు!

సైనికుల కవాతు ప్రారంభమయింది. వారు తొడుక్కున్నంత అందమైన బూట్లు రష్యా షాపుల్లో మన కెక్కడా కనుపించవు. కాకపోతే, రాతిరోడ్డుమీద ఆజోళ్ళ వల్ల అవుతున్న ధ్వని మాత్రం దారుణంగా వుంది. రష్యన్ సైనిక విన్యాసాలు చాలావరకు జర్మన్ సైనిక విన్యాసాలలాగానే వుంటాయి. వీరుకూడా మోకాలు మడవకుండానే అడుగు వేస్తూ వుంటారు. ఎదుటివారు దద్దరిల్లేటంత బలంగా వుంటాయి వారు వేసే అడుగులు.

ఈ సైనిక ప్రదర్శనాలు గంటంబావుసేపు జరిగాయి. ఆ తరువాత పౌరసంఘాలవారు, కార్మిక సంఘాలవారు, క్రీడాసమితులవారు, విద్యార్థి ప్రతినిధివర్గాలవారు ప్రదర్శనాలు జరిపారు. రంగు రంగుల సిల్కు జెండాలు పుచ్చుకున్న జన సమూహం క్రమంగా కదిలిపోతూవుంటే, నిజంగా ఆ దృశ్యం చూడ ముచ్చటయింది.

వారు జరుపుతున్న ప్రదర్శనలను ఒక్క అరగంట పాటుచూచి, మొఖోవాయా స్క్వేర్ కు బయలు దేరాము.

ఈ ప్రదర్శనాలు మధ్యాహ్నం పదకొండున్నరకు ప్రారంభమై నడిరాత్రి వరకూ జరిగాయి. ఆ తరువాత ఇవ్వాళ రాత్రి వీధులలో నృత్య ప్రదర్శనాలు, విద్యుద్దీప ప్రదర్శనాలు జరుగుతాయి. బాణాసంచా కూడా కాలుస్తారు.

డిసెంబరు 3, 1949

నా భర్త గదికిటికీ వెలుపలనున్న థర్మా మీటరు ఎనిమిది, పది డిగ్రీల మధ్య టెంపరేచర్ చూపిస్తున్నది. మాస్కోనగరంలో మంచుపడడం బాగా ప్రారంభమయింది. నగరంలో వున్న మురికినంతనూ తుడిచిపెట్టి, చూపట్టు మేర అంతా ఒక కొత్త వెలుగునిస్తూ, ఈ మంచు ఒకవిధంగా నగరానికి తగివుంది. నగరంలోవున్న చర్చి లన్నిటికీ రంగులువేసి, గోపురా లన్నిటికీ మెరుగులుదిద్దివున్న రోజుల్లో అవన్నీ ఎంతో చూడ ముచ్చటగా వుండి వుంటాయనిపిస్తోంది.

ఇక్కడి ఒక పెద్ద చర్చిలో జరుగుతున్న సాయంకాలపు ప్రార్థనకు గత శనివారంనాడు మేము హాజరైనాము.

రష్యన్ చర్చిలలో కూర్చునేటందుకు సదుపాయాలుండవు. ఎలాగో ఒకలాగ నిలబడడానికి మాత్రం వీలయేటంతగా చర్చి లోపల జనం కిటకిట లాడుతున్నారు. అక్కడికి వచ్చినవారిలో చాలామంది ముసలివాళ్ళు- వారిలోకూడ ముసలి ఆడవాళ్ళే ఎక్కువ మంది- కాని మగవారుకూడా నేను వూహించిన దానికంటె ఎక్కువమందే వున్నారు. వాళ్లందరుకూడా దైవభక్తి పరులులాగానే కనిపించారు. కాని అందరూ కటిక దరిద్రులాగా వున్నారు. చర్చి గుమ్మంముందు వరుసగా నిలబడి వున్న ముష్టివాళ్ళనుచూస్తే ఇక్కడి చర్చిల

దగ్గర ఇలా ముష్టి వాళ్ళుండడం సర్వసాధారణమైన విషయ మేమోననిపిస్తున్నది.

చర్చికి వచ్చిన వాళ్లందరూకూడా ప్రార్థనలో పాల్గొన డానికి వీలులేకుండా దైవారాధన అంతా తెరమరుగునే జరుగుతుంది. అంతసేపూ చర్చికి వచ్చినవాళ్ళు పాటలు పాడుతూ వుంటారు. చర్చిలో ఒకవైపున బాల్కనీలోవున్న వాళ్ళు ముందు పాట పాడడం ప్రారంభిస్తారు. ఆ తరువాత అవతలివైపు వాళ్లు అందుకుంటారు. ఈ పాటలన్నీ చాలా చిన్నవిగాను, చాలవరకు అపస్వరాలతో కూడినవిగాను వుంటాయి. చర్చిలోపల అంతా ఐశ్వర్యం తాండవిస్తోంది. బంగారపు వస్తువులు విపరీతంగా వున్నాయి. ప్రతివస్తువు కన్ను చెదిరేటట్లుగా వుంది. చర్చి అంతటా దేవతా స్వరూపాలు (వీటిలో చాలా భాగం కళావైశిష్ట్యమేమీ లేని దేవతా చిత్రాలే), బ్రహ్మాండమైన 'షాండలియర్లు' (కొమ్మల రెమ్మలు) పెద్దపెద్ద కొవ్వొత్తులు, దీపాలు ఎక్కడపడితే అక్కడ వున్నాయి.

నిజానికి, ఈప్రదేశం హృదయ రంజకమైనది, ఉత్తేజకర మైనది, పవిత్రమైనది కావడంవల్లనే ప్రజలు, ముఖ్యంగాసుందర దృశ్యాలను చూచి రాగల ఆర్థిక స్తోమత లేనివారు ఇక్కడికి వచ్చి సంతృప్తి పొందుతున్నారు. దైవప్రార్థనలు వారానికి చాలాసార్లు జరుగుతాయి. ప్రతిసారికూడా, మేము వెళ్ళి నప్పటిలాగానే జనం విపరీతంగా వస్తూవుంటారు. రష్యన్ ప్రజలు ముఖ్యంగా మత విశ్వాసపరులనీ, అటువంటి వారిలో గల ఈ ప్రగాఢమైన మత విశ్వాసాన్ని లెనిన్, స్టాలిన్ల

వైపు, కమ్యూనిస్టు పార్టీ తత్వాలవైపు మళ్ళించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదనీ నేను గమనించాను.

జీవనవిధానానికి దోహదంచేసే ప్రతి అంశాన్ని – కళలను, సంస్కృతిని–నిర్జీవం చేసివేయడానికై క్రెమ్లిన్ చాచిన కరాళహస్తం సర్వత్రా కానవస్తున్నది. నిన్నరాత్రి సోవియట్ సంగీత విద్వత్ పరిషత్తువారు జరిపిన సంగీత కచేరీ ముగియగానే కచేరీ వినడానికై వచ్చిన వారి నందరినీ ఒక్కసారి కలయజూచాను. వీరంతా ప్రత్యేకమైన ఆహ్వానాల మీాద అక్కడకు వచ్చినవారు. వీరిలో చాలామంది స్వయంగా స్వరకల్పన చేసినవారే కావడంవల్ల ఉత్తమ సంగీతం అంటే ఏమిటో వీరికికూడా తెలుసు. వెనకటి రోజుల్లో రష్యన్ సంగీతాన్ని విని ఆనందానుభూతిని పొందిన మనకి, ఈ సంగీతం అసహ్యంగా వుంటుంది. కాని, తమ సంగీత కళ అంతా సంకరమైపోతూవుంటే చూస్తూ ఊరుకోనవలసి వస్తున్న ఆ సంగీత విద్వాంసుల పరిస్థితి నిజంగా ఎంత దారుణమైనది! తమ బృందవాద్యనాయకులలో అగ్రగణ్యుడైన షష్టాకోవిచ్ కొత్తగా చేసిన స్వరకల్పన విన్నప్పుడు వారి ముఖాలు విషాదపూరితమైనాయి. సోవియట్ బ్యూరో సభ్యులమెప్పును తాను తిరిగి పొందడానికై ఆయన చేసిన స్వరకల్పన అది. స్టాలిన్ ప్రారంభించిన వనమహోత్సవ కార్యక్రమాన్ని శ్లాఘిస్తూ ఆయన ఆ స్వరకల్పన చేశాడు.

డిసెంబరు 13, 1949

బయట ఎక్కడచూసినా చెమ్మవూరుతూ, కాంతి విహీనంగా వుంది. ఇంతవరకు పడుతూ వచ్చిన మంచు అంతా

కరిగిపోయింది. ఇంకా అక్కడక్కడ మిగిలి వున్న మంచు మట్టితో బాటు గడ్డ కట్టుకుపోయివుంది. క్రిస్ మస్ పండగరోజుల్లో మళ్ళీ మంచు పడుతుందనుకుంటాను. మంచు కరిగి పోయిన మాస్కో ఏదో వెలితిగా, బావురుమంటూ వుంటుంది.

సోవియట్ ప్రభుత్వం క్రిస్ మస్ సెలవలన్నిటినీ రద్దు చేసింది. నిజానికి ఇదేమీ ఆశ్చర్యపడవలసిన విషయం కాదు. ఇక్కడివారు జరుపుకునే పండగ క్రిస్ మస్ పండగ కాదు; సంవత్సరాది పండగ. రష్యావారు చిత్రవిచిత్ర రీతుల దీపాలతో అలంకరించే వృక్షాలు క్రిస్ మస్ వృక్షాలు కావు; సంవత్సరాది వృక్షాలు. స్పాసోభవనం మధ్యనున్న హాలులో మేము ఏర్పాటు చేయనున్న క్రిస్ మస్ వృక్షాన్ని అలంకరించడానికి కావలసిన సామానులన్నీ కొనుక్కుని రావడానికై నేను రేపు బజారు వెడుతున్నాను. ఈ భవనంలో వున్న మిగతా అన్ని వస్తువుల లాగానే, మేము అలంకరించబోయే క్రిస్ మస్ వృక్షం కూడా పెద్దదిగాను, ఆకర్షవంతంగాను వుండి తీరాలి.

డిసెంబరు 20, 1949

క్రిస్ మస్ పండగలప్పుడు మంచు పడుతుందనుకున్నాం. అలాగే, ఇదిగో—అదేపనిగా కురుస్తున్న మంచు! నిన్న రాత్రి పొద్దుపోయేవరకు, ఇవ్వాళ పొద్దునకూడా రోడ్డువారగా వున్న యిళ్ళవాళ్ళు తవ్వుగోరలు, పారలు పుచ్చుకుని మంచును అదే పనిగా తవ్విపోస్తున్నారు. వీధిలో మంచు పడ్డ కొద్దిగంటల లోపలే దానినంతా వారు శుభ్రంగా తుడిచివేయాలనే శాసనం ఒకటి ఇక్కడ అమలు జరుగుతున్నది.

డిసెంబరు 21 వ తేదీన స్టాలిన్ 70 వ జన్మదినోత్సవం జరుగుతుంది. అంతవరకు కమ్యూనిస్టు చైనా అధ్యక్షుడు మావో సే-టుంగ్ మాస్కోలోనే వుండటానికి నిశ్చయించు కున్నాడని కొందరంటున్నారు. కాని, ఆయన ఇక్కడ వున్న విషయాన్ని గురించి ఏవిధమైన ప్రచారమూ దాదాపు లేదనే చెప్పవచ్చు. ఎంతో పదగుంభన ఉపయోగించి తయారుచేసిన ప్రకటన ఒకటి వెలువడింది; సోవియట్ యువకులకు, చైనా యువకులకు మధ్యగల ఐకమత్యాన్ని తెలియజేసే పోస్టర్లు కొన్ని ప్రదర్శించబడినాయి. ఈ విషయంలో జరిగిన ప్రచార మంతా ఇంతే.

స్టాలిన్ గౌరవార్థము, ఆయన సామ్రాజ్యం కొత్తగా విస్తరించిన ప్రాంతాల పరిపాలకుడైన మావో సే-టుంగ్ గౌర వార్థము బోల్షాయ్ థియేటరులో "రెడ్ పాప్పీ" అనే బేలెట్ నృత్యం ప్రత్యేక ప్రదర్శనం జరుగుతుందనీ, ఆ ప్రదర్శనానికి కమ్యూనిస్టుపార్టీ పెద్దలందరూ హాజరవుతారనీ మేమువిన్నాం.

నల్లమందు దొంగవ్యాపారము, అమెరికన్, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కుట్రలు ఈ "రెడ్ పాప్పీ" బేలెట్ నృత్యానికి ఇతివృత్తం. అసలు ఈ బేలెట్ కొత్తదేమీకాదు. ఐతే, అప్పటికీ ఇప్పటికీ కొన్ని మార్పులు చేయబడినాయని ఈ రెంటినీ చూచినవారు చెపుతున్నారు. చైనా ప్రజల పతనావస్థను గురించి పూర్వం ఈ బేలెట్ ప్రధానంగా వివరిస్తూ వుండేది; కాని, దరిమిలా, కమ్యూనిస్టు సిద్ధాంతానుసారంగా కథా సంవిధానాన్నంతను మార్చి, ఈ బేలెట్‌ను చాలావరకు తిరగవ్రాశారు. ఇలా మార్పులు చేయబడిన బేలెట్‌లో

అమెరికనులను పరమతుచ్ఛులుగా చిత్రించారు. నల్లమందు దొంగవ్యాపారానికి తోడు ఆయుధాలను దొంగతనంగా దేశంలోనికి రవాణా చేయడాన్నికూడా జతచేర్చారు. ఈ బేలెట్ ప్రదర్శనంలో కూలీ ముఠావాళ్ళు లోపలికి తెచ్చే కొయ్యపెట్టె లన్నిటిపైన "అమెరికాలో తయారు" అనే ముద్రలు కనుపిస్తూ వుంటాయి.

వ్యక్తిగతంగా మాకు మరొక ఘనవిజయం చేకూరింది. గత శనివారంనాడు గ్రోమికో, ఆయన భార్య మా యింటికి విందుకు వచ్చారు. కాక్‌టైల్సు (చౌచౌ సారాయి), పెట్రీ (తెల్లద్రాక్ష సారాయి), టొమాటో రసం యిచ్చాము. పాస్టోవ్ ఒక్కడు మాత్రం బెదురుతూ బెదురుతూ ఒక్క గ్లాసు పెట్రీ పుచ్చుకున్నాడు. గ్రోమికో దంపతులిద్దరూ టొమాటో రసం మాత్రమే పుచ్చుకొన్నారు.

గ్రోమికో నాకు కుడివైపున కూర్చున్నాడు. ఆయన తిన్నదికూడా చాలా తక్కువ. మావో సే-టుంగ్ గౌరవార్థం క్రెమ్లిన్‌లో జరుగనున్న పెద్ద విందుకు మరొక గంటసేపట్లో తాను హాజరు కావలసివుండడం ఇందుకు తప్పకుండా కారణమై వుంటుంది. కాని, మదాం గ్రోమికో మాత్రం బాగా ఆరగించింది. ఈ విందు ఆమెకు బాగా నచ్చినట్లుకూడా వుంది.

మా సంభాషణ కొంతవరకు ముక్తసరిగా ఉన్నమాట వాస్తవమేగాని, ఆ మాట్లాడిన విషయం, సంభాషణ తీరు మాత్రం చాలా సమంజసంగానే వున్నాయి. వాళ్ల అబ్బాయి విషయం ప్రస్తావించాము. తల్లి తండ్రులతోపాటు ఆ కుర్రవాడు అమెరికాలో చాలా సంవత్సరాలపాటు వున్నాడు. అప్పుడు ఆ

కుఱ్ఱవాడు నేర్చుకున్న ఇంగ్లీషుభాష అంతా ఇంకా గుర్తు ఉంచుకున్నాడా, లేక మరిచిపోయాడా అని మదాం గ్రోమిం అడిగాను.

"గుర్తు వుంచుకోవడం వాడికి చాలా కష్టంగా వుంది. ఒక్కొక్కప్పుడు వాడిగదిలో ఒంటరిగా కూర్చుని వాడిలో వాడే ఇంగ్లీషు మాట్లాడుకుంటూ వుంటాడు. వాడితో ఇంగ్లీషు మాట్లాడడానికి ఇక్కడెవరూ లేరన్న సంగతి మీకు తెలుసు కదూ?" అన్నది ఆమె.

నిజంగా ఎలాటి అసహ్యాకరమైన పరిస్థితి! మామూలుగా అయినట్లయితే, "లేకేమి? అతగాణ్ణి మా యింటికి పంపుతూ వుండండి. అతడు మా అబ్బాయి రోజరు కులాసాగా కబుర్లాడుకుంటూ వుంటారు" అనివుండవలసింది. కాని రష్యాలో సహజధోరణిలో మాట్లాడడానికిగాని, ఉచిత రీతిని ప్రవర్తించడానికిగాని ఎంతమాత్రం వీలులేదని ప్రతివారు అడుగడుగునా గుర్తుంచుకొనవలసి వుంటుంది.

జనవరి 21, 1950

ఎల్లెన్, నేను నిన్న బజారునుంచి వస్తూవుంటే ఒక విశేషం జరిగింది. సోవియట్ పౌరులెవరూ మాలో ఎవరితోనూ మనసిచ్చి మాట్లాడరు. కాని, ఒక స్త్రీ మాతో మాట్లాడింది! అదే విశేషం. మార్కెట్టు నుంచి రెడ్ స్క్వేర్‌కు పోయే సువిశాలమైన గోర్కీ వీధిగుండా మేము నడిచి వెడుతున్నాం. ఒక స్త్రీ మా దగ్గరకు వచ్చి, రష్యన్ భాషలో ఇలా అన్నది:

"మీరు ఇంగ్లీషు మాట్లాడుతుండగా విన్నాను. దైవం రక్షించి, మీరు అమెరికనులా?"

మేము అమెరికనులమేనని ఎల్లెన్ సమాధానం చెప్పింది.

"పూర్వం ప్రతి రోజూ రాత్రిపూట నేను వాయిస్ ఆఫ్ అమెరికా రేడియో కార్యక్రమాలు, బి.బి.సి. రేడియో కార్యక్రమాలు వింటూ వుండేదాన్ని. కాని ఆ కార్యక్రమాలిప్పుడు రేడియోలో వినిపించడం లేదు. అంత మంచి కార్యక్రమాలు వినిపించనందుకు నిజంగా నేను విచారిస్తున్నాను," అని అన్నది.

అని, ఆమె మాతో పాటు కొంచెం దూరం వచ్చి, ఎల్లెన్‌తో ఇలా అన్నది:

"మీరు కొత్తగా కనిపెట్టిన మందులు అద్భుతమైనవని చదివాను. కొద్దిగా స్ట్రెప్టోమైసిన్ తెప్పించుకోవడానికి ఏమైనా అవకాశ ముంటుందంటారా? మా తమ్ముడు ఒకడు క్షయవ్యాధితో చచ్చిపోతున్నాడు. ఆ మందునిస్తే వాడు బతక వచ్చునని డాక్టర్లు అనుకుంటున్నారు."

ఆమెకు మేము ఏ విధంగాను సహాయం చేయడానికి వీలులేనందుకు విచారిస్తున్నామని ఎల్లెన్ చెప్పింది. నిజంగా మేము చాలా బాధపడ్డాము. మేము ఆమెకు ఏమైనా సహాయం చేయగలిగితే బాగుండు ననుకున్నాం. కాని, వాళ్ళ డాక్టరు వద్దకూడా ఏవో మందులు తప్పకుండా వుండి వుంటాయి అని చెప్పాము.

"అర్థమయింది. అయినా ఫరవాలేదు లెండి. ఒకనాటికైనా మంచిరోజులు తప్పకుండా వస్తాయి."

అని, ఆమె ఎల్లెన్‌తో కరచాలనం చేసి, తిరిగి వెళ్ళిపోయింది. ఇదంతా అత్యంత విషాదకరమైన విషయం. అసలు

ఆమె చెప్పిన మాటలన్నీ నిజమౌనో కాదో తెలుసుకునేటం. దుకు మాకు ఏ విధమైన అవకాశమూ లేదు. ఒకవేళ అదంతా నిజమే అయినప్పటికీ మేము చేయగలిగింది కూడా ఏమీ లేదు. ఎందువల్లనంటే, ఏమైనా చేయబోవడం ఆమెకు, మాకుకూడా అత్యంత ప్రమాదకరంగా పరిణమిస్తుంది. నిజానికి, ఆమెరాక యొక్క లోగుట్టు ఏమిటో మాకు తెలియదు. ఈ విషయంలో మాకు తెలిసిందల్లా, ఆమె మమ్మల్ని అనుసరించిందనీ, ప్రమాదాన్ని లెక్కచేయకుండా మాతో మాట్లాడిందనీ మాత్రమే!

మేము రాయబార కార్యాలయానికి వెళ్ళినతరువాత, మా డాక్టర్ని కలుసుకుని, స్ట్రెప్టోమైసిన్ మొదలైన ఔషధాలు ఇక్కడ ధారాళంగా లభిస్తున్నాయా లేదా అని అడిగాము. ఆ ఔషధం రష్యాలో తేలికగా లభించడం లేదని ఆయన చెప్పాడు. కావాలనుకుంటే ఔన్సు ఒకటికి 100 రూబుల్స్ చొప్పున బ్లాక్ మార్కెట్టులో దొరుకుతుందని, ఎవరికైనా బాగా చికిత్స జరగాలంటే ఆ ఔషధాన్ని 40 గ్రాములవరకు వాడవలసి వుంటుందనికూడా ఆయన చెప్పాడు.

ప్రస్తుతపు మారకపు రేటుప్రకారం 100 రూబుల్స్ 12.50 డాలర్లకు (సుమారు 60 రూపాయలు) సమానం. అటువంటప్పుడు 4000 రూబుల్స్ ఆర్థికస్తోమత వున్న వాళ్ళు, రష్యన్ జనసామాన్యం దృష్టిలో కుబేరులే! ఒకవేళ అంత డబ్బు వారికి వున్నప్పటికీ నలభై గ్రాముల స్ట్రెప్టోమైసిన్ వారికి దొరకడం దాదాపు అసంభవం. మంచిమంచి ఔషధాలన్నీ అదృష్టవంతులైన కొద్దిమంది పెద్దలకోసం ప్రత్యేకించబడుతాయి. ఇక్కడ ఎంత ఎక్కువ రాజకీయ ప్రాబల్యం

వుంటే, పునరారోగ్యం పొందడానికి అంత ఎక్కువ అవకాశం వుంటుందని మీరు నిస్సందేహంగా నమ్మవచ్చు.

జనవరి 26, 1950

ఆస్ట్రియా సంధి విషయమై గ్రోమికోతో చివరిసారి జరిపిన ఇంటర్వ్యూ సందర్భంలో నా భర్త ఆయనను ఇలా అడిగారు: "అయితే, మనం ఒక ఒడంబడికకు రాగల అవకాశం ఇంకా ఎంత కాలాని కొస్తుందనుకొంటున్నారు? మరి, ఈ చర్చలు చాలాకాలంనుంచీ జరుగుతున్నాయి గదా."

"అది, కాలానికి మీ రిచ్చే విలువనుబట్టి వుంటుంది" అని గ్రోమికో సమాధాన మిచ్చాడు!

సరిగ్గా ఇదే రష్యావారి నిజవైఖరి. ఈ వైఖరిని విస్మరించకుండా, వీరితో మనకున్న వ్యవహారాల నన్నిటినీ నిర్వహించకుంటూ వుండాలి.

జనవరి 31, 1950

మరొక కొత్త రకం పనిని ఇక్కడి స్త్రీలు చేస్తూ వుండటం ఇవ్వాళ గమనించాను—చెత్త చెదారాన్నంతా వీరు ఇంటింటి నుంచీ పోగుచేసి లారీలలోకి ఎత్తుతున్నారు. ఈ చెత్తడబ్బాలను మాస్కో నగరాధికారులే ఉచితంగా గాని, అద్దెకుగాని యిస్తూవుంటారనుకుంటాను.

ఇక్కడి అద్దెయిళ్ళ పరిస్థితిని గురించి పరిశీలన జరిపితే చాలా విచిత్రమైన విషయాలు బైటపడుతాయి. ప్రతి యింట్లోను నివసిస్తున్న వారి పేర్ల జాబితాలు ఆ యిళ్ళ తలుపుల మీద ఉంటాయి. ఇవ్వాళ పొద్దున నేను వెడుతున్నదారిలో

ఒంటి అంతస్తు మేడను ఒకదానిని చూచాను. ఇక్కడి అద్దె యిళ్ల పరిస్థితికి దీనిని చక్కని ఉదాహరణంగా తీసుకోన వచ్చు — ఈ మేడకు ముందువైపున ఎనిమిది కిటికీలు, పక్క వైపున ఐదు కిటికీలు వున్నాయి. ఈ యింటి సింహద్వారానికి వ్రేళ్ళాడతీసివున్న బోర్డుమీద మొత్తం 32 పేర్లు వున్నాయి. ఇంకాకొంచెం అవతలగా వున్న ఇటువంటి భవనానికి ముందు వైపున ఐదు కిటికీలు, పక్కవైపున మూడు కిటికీలు వున్నాయి. 20 పేర్లుగల బోర్డు తగిలించబడింది.

ఇక్కడి యువతీ యువకుల పెళ్ళిళ్ళ ఏర్పాట్లు జరుపుకునేటప్పుడు అద్దె యిళ్ళ పరిస్థితి ప్రధానంగా విచారించవలసిన విషయాలలో ఒకటి! ఎందువల్లనంటే, వారు స్వంతంగా కొత్తకాపరాలు పెట్టుకొనడానికి ఏ మాత్రమూ అవకాశం లేదు. ఒక్కొక్క యిల్లునంతనూ ప్రత్యేకంగా కేటాయించ తగ్గంతమంది సభ్యులు కుటుంబంలో వుంటేనేకాని, వారికి వుండడానికి రవ్వంత పంచ అంటూ లభించడం అసంభవం. అయినప్పటికీ వాళ్ళు పెళ్లిళ్ళుచేసుకుని, అత్తమామలతోగాని, అత్తమామల బంధువులతోగాని, ఎలాగో ఒకలాగ కాలక్షేపం చేస్తున్నారు.

విడాకులిచ్చిన భార్య ఆయింట్లోనే కొంచెం పెడగా వుంటూ వుండగా, భర్త మరొక పెళ్ళాన్ని తెచ్చుకుని అక్కడే కాపురం చేస్తూ వుండటంకూడా జరుగుతూ వుంటుందని మా పనివాళ్ళలో ఒకళ్ళు నాతో అన్నారు. ఉండటానికి చోటు అంటూ చూపించకుండా ఆమెను పొమ్మనడానికి భర్తకు వీలులేదు.

భార్యాభర్తలు విడాకు లిచ్చుకొనడం సోవియట్ యూనియన్‌లో క్రమంగా తగ్గిపోతున్నది. కుటుంబ సమైక్యతను గురించి, పిల్లల పెంపకం విషంలో అటువంటి సమైక్యతకు గల ప్రాధాన్యాన్ని గురించి ఇక్కడి పత్రికలలో వెలువడే వ్యాసాలు నొక్కి చెపుతున్నాయి. బాలమందిరాల ద్వారా (నర్సరీ, కిండర్ గార్టెన్ల ద్వారా) కార్మికుల పిల్లలకు ప్రాథమిక విద్యా సౌకర్యాలు కల్పించబడుతున్నాయి. ఇళ్ళవద్దనే పెంపకం జరగడానికి వీలున్న శిశువులకు ఇటువంటి సౌకర్యాలు అవసరమే లేదు. ఐతే, ఏపిల్లలకు డ్యాన్సు పాఠాలు చెప్పాలో, ఏ పిల్లలు ఇంగ్లీషుగాని ఫ్రెంచిగాని నేర్చుకోవాలో, కామ్ సోమోల్ శిక్షణకు పంపతగ్గ తెలివితేటలను ఎవరు చూపించారో, ఎవరు విశ్వకళా పరిషత్తులలో చదువుతారో నిర్ణయించేది ప్రభుత్వమే.

రష్యాలో తల్లిదండ్రులు తమ బిడ్డలు పసివారై వుండగా వారిపట్ల విపరీతమైన అనురాగాన్ని చూపుతారు. దరిమిలా ఈ పిల్లలందరికి ఈనాటిరష్యన్ లక్షణాలన్నీ అబ్బుతాయి. ఇటువంటి మార్పును పన్నెండు, పదమూడేళ్ళ బాల బాలికలందరిలోనూ కనిపెట్టవచ్చు. వారి జీవితాలను ప్రభుత్వం తనతో పెనవేసుకునేది ఆ వయసులోనే.

ఫిబ్రవరి 3, 1950

మా ప్రయాణానికి ఏర్పాటులన్నీ పూర్తిఅవుతున్నాయి. పెద్ద విమానం ఒకటి ఫిబ్రవరి ఇరవై మూడున ఇక్కడికి వస్తుందనీ, మేము ఇరవై యైదున ఇక్కడనుంచి బయలు దేరవచ్చుననీ, మాకు కబురు వచ్చింది. జర్మనీలో ఒక రాత్రి

గడిపి, ఆ తరువాత బ్రసెల్స్ నగరానికి వెడతాము. ఈ ప్రయాణానికి కావలసిన బట్టలు కుట్టించుకోనడానికి మూడు రోజులు ప్రత్యేకించ దలుచుకున్నాను. ఆ పనిని సకాలంలో నాకు పూర్తిచేసి పెట్టడానికిగాను వేరొక దర్జీచేత బట్టలుకుట్టి స్తున్నాను కూడా.

ఫిబ్రవరి 11, 1950

మేము మాస్కో వదలి వెళ్ళడానికి ఇంకా రెండు వారాలు మాత్రమే వుంది. ఇవ్వాళ మంచు బాగా పడు తున్నది. కాని, మేము ఇక్కడినుంచి తేలికగా వెళ్ళిపోవ డానికి వీలుగా ముందు ముందు వాతావరణం తేట పడు తుందని అనుకుంటున్నాను.

మేమిక్కడ ఉద్యోగం చేయవలసిన కాలపరిమితిలో దాదాపు మూడవవంతు గడిచిపోయిందని నా భర్త మొన్న చెప్పారు. ఈ విషయం విన్నప్పుడు నిజానికి నాకెంతో హాయి అనిపించింది. ఇక్కడి మాజీవితం అప్పుడప్పుడుమాత్రం చాలా బాగుంటున్నది. కాని మన ప్రపంచానికి చాలా దూరంలో, మన ప్రపంచానికి భిన్నమైన విధానాలు అమలు జరుగుతున్న చోటఇలాఉండడం అమానుషమైనవిషయం. ఇటువంటి వాతా వరణంలో చాలాకాలం వుండవలసి వచ్చినవారు ఎటువంటి బాధకు లోనౌతారో నేను అనుభవ పూర్వకంగా ఊహించ గలుగుతున్నాను. అటువంటివారి పరిస్థితికి, ముఖ్యంగా, చిన్న చిన్న దేశాల రాయబార కార్యాలయాలలో పనిచేస్తున్న మా సాటి ఉద్యోగుల పరిస్థితికి నేను ఎంతో విచారిస్తున్నాను. ఈ చిన్నచిన్న దేశాల రాయబార కార్యాలయోద్యోగులపట్ల

ర్మష్యానులు మరీ అసహ్యాంగా ప్రవర్తిస్తారు. స్వల్ప విషయాలకు వాళ్లని వేధించి, వారి జీవితాలు దుర్భరమయ్యేటట్లు చేస్తారు.

చివరికి మిరియాలు కూడా ఇక్కడ ఎంతో అపురూపమైన వస్తువే! మాకు బట్టలుకుట్టే స్త్రీలలో ఒకతె తనకు మజూరీని వస్తురూపంలో ఇవ్వమన్నది-పైగా, ఆమె కోరిన వస్తువులుకూడా, బట్టలు ఉతుక్కునే సబ్బు కడ్డీలు మూడు, మెంతులు ఒక డబ్బాడు మాత్రమే. ఆమె మాకు ఒకరోజుకు పైగా పనిచేసింది. కాని ఆమె కోరిన ఆ వస్తువులిస్తే నిజంగా తనకు రావలసిన దానికంటే ఎక్కువే వచ్చినట్లు సంబరపడింది. పనిచేస్తున్న కార్మికులకు ఇక్కడివారు ఒక్కపూట భోజనం మాత్రం తప్పకుండా పెడతారు. నానురొట్టె, మాంసము, కాయగూరలు వేసి కాచిన ఒక విధమైన అంటు పులుసు, ఇవి వారికిచ్చే భోజన పదార్థాలు. కాని, వీటి పరిమాణం, వారు చేసే పనిమీద ఆధారపడి వుంటుంది.

చాకలి షాపులను పరిశీలిస్తే ఇక్కడి ప్రజలు ధరించే దుస్తులు ఎటువంటివో చాలావరకు తెలుస్తుంది. పురుషులు, స్త్రీలు, అనేభేదంలేకుండా అందరూ ధరించే రంగునూలు అల్లిక బనియనులు; గోధుమరంగు, ముదర నీలంరంగు, కాషాయరంగులవి మోకాళ్ల వరకు వచ్చే అల్లికబ్లూమర్లు (స్త్రీలు తొడుక్కునే వాడులుపాటి లాగూలు); పసిపిల్లల పొత్తిళ్ల గుడ్డలుగాని, పాత్ర సామానులు తుడిచే గుడ్డలుగాని అయ్యుండ తగ్గ (అంచులు కుట్టనివి) నలుచదరపు పచ్చని గుడ్డల వరుసలు; అతుకుల మారి దుప్పట్లు కొన్ని; బల్లలపైన పరిచే గుడ్డలు ఒకటి, తప్పితే రెండు; ముతక నూలువి అల్లిక తెరలు చెదురు

గాను – మీకు కనిపిస్తాయి. ఎక్కువగా కనుపించే బట్టలు ఇవి మాత్రమే. వీటితోబాటు రంగు-చొక్కాలు, స్త్రీ పురుషులు ధరించే జెర్సీలు (స్వెటర్లు) కూడా చెదురుగా కనుపిస్తాయి.

ఫిబ్రవరి 15, 1950

ఇక్కడి సొరంగపు రైలుమార్గంగుండా మొట్టమొదటి సారిగా నిన్న ప్రయాణం చేశాను. నా వెంట ఎల్లెన్ మోరిస్ కూడా వుంది. ఇంతకు పూర్వమే ఇటువంటి ప్రయాణం చేదామనుకున్నాను. కాని, ఒంటరిగా వెళ్ళడానికి సాహసించలేకపోయాను. మరేమీ ఫరవాలేదు రమ్మని ఎల్లెన్ మోరిన్ నన్ను బలవంతపెట్టినమీదట బయలుదేరగలిగాను. రష్యన్లు తమ సొరంగపు రైళ్లను గురించి అదేపనిగా పొగుడుకుంటూ వుంటారు. ఐతే, నిజానికి అది చాలా బాగున్నదని ఒప్పుకొనవలసి వుంది కూడాను. ఈ సొరంగపు రైలుమార్గంలోని స్టేషనులన్నీ పాలరాళ్లతోను, ఇంకా ఇతరమైన మెరుపు రాళ్ళతోను నిర్మించబడి, కాంతులీనుతున్నాయి. స్తంభాల వరుసలతోను, విద్యుద్దీపాలు వెలుగుతున్న ఆర్చీలుగల మార్గాలతోను, సుందరమైన కుడ్యశిల్పాలతోను, కంచు విగ్రహాలతోను కళ్ళు చెదిరేటట్లుగా వున్నాయి. ఖర్చులనేమీ లెక్కచేయకుండా వీటినన్నిటినీ చాలా బాగా పోషిస్తున్నారు. ఇక్కడి రైళ్లు అన్నీ బాగా విశాలంగా వున్నాయి. వాటిలో దీపాలుకూడా బాగానే వెలుగుతున్నాయి. ప్రయాణీకుల రద్దీ కూడా ఆట్టేలేదు. మొత్తంమీద మాస్కోలోని సొరంగపు రైలుమార్గాల నిర్వహణ బాగున్నది. నిజాని కిది అధికారులు గర్వపడతగ్గ విషయమే.

అసలు మాస్కోలోని ప్రయాణ సౌకర్యాలన్నీకూడా చాలావరకు బాగానే వున్నాయి. ట్రాలీబస్సుల (విద్యుచ్ఛక్తి సహాయంతో ప్రయాణంచేసే బస్సులు) రాకపోకలు చాలా సమర్థతో నిర్వహించ బడుతున్నాయి. వీలయినచోట్లల్లా ట్రాములకు బదులుగా ఈ ట్రాలీ బస్సులనే నడుపుతున్నారు. సకుటుంబంగా ఎవరైనా ఏదైనా కొత్తచోట్లు చూసిరావా లనుకున్నా; ఆప్తులు ఎవరైనా చనిపోయినప్పుడు అంత్య క్రియ లకు హాజరు కావాలనుకున్నా, పెళ్ళిళ్ళకు పోయిరావాలను కున్నా, ఒకచోటనుంచి మరొకచోటుకు మకాం మార్చాలను కున్నా-ఇటువంటి సందర్భాలన్నిటిలోను రష్యనులు మోటారు ట్రక్కులు (ఒకటిన్నర టన్నువి) బాడుగకు మాట్లాడుకుంటూ వుంటారు. ఈ ట్రక్కుల (లారీలు)పైన ఆచ్ఛాదన ఏమీ వుండదు. వీటికి ఇరువైపులవుండే చెక్కలను కిందికి వాల్చివేయడానికి వీలుగా వుంటాయి. వీటిలో బల్లలు, కుర్చీలుకూడా వుండడం కద్దు. కాని, ఇటువంటి సదుపాయాలేమీ లేనివే ఎక్కువ.

పీనుగులను స్మశానాలకు చేరవేసే కారులు వీధివెంట పోతూవుండగా రెండుసార్లు మాత్రమే చూచాను. అంత్య క్రియలకు హాజరవుతున్న వారంతా ఆ కారులోనే శవపేటిక చుట్టూ కూర్చునిగాని, నిలబడిగాని వుంటారు. ఈ శవపేటికకు పైన మూత ఏమీ వుండదు. మరణించిన వ్యక్తియొక్క ఆప్త మిత్రులు, బ్యాండువాద్యబృందంవాళ్ళు మరొకలారీలో వెంట వెడుతూ వుండడంకూడా ఇక్కడ అప్పుడప్పుడు కనుపిస్తుంది. ఇక్కడ మరణించినవారికి దహన సంస్కారమే సాధారణంగా చేస్తూవుంటారు. ఇదే కర్చు తక్కువకూడాను. ఇలా అయితే,

ఐదు రూబుల్స్ (ఒకటింబావుడాలరు) మాత్రమే కర్చవుతుందని నేను విన్నాను. దహన సంస్కారాలు జరిగే ప్రదేశంలోనే, చాలామందికి ఖనన సంస్కారాలుకూడా ఇక్కడ తున్నారు.

చాలా చలిగావున్న ఒకరోజు విషయం. నేను మా రాయబార కార్యాలయాన్నుంచి శ్పాసోభవనానికి తిరిగి వస్తున్నాను. ముసలివాడొకడు శవపేటిక ఒకదానిని చలుగుడు (స్లెడ్) పైన పెట్టుకుని రోడ్డువారగా వున్న గతుకులప్రదేశంగుండా ఈడ్చుకుపోతున్నాడు. అతడలా వెడుతున్నప్పటికీ, అంతా నన్ను కనిపెట్టేవాళ్ళే కాని, అతడి విషయం రవ్వంత కూడా పట్టించుకున్నవాళ్లు లేకపోయా రక్కడ. నేను ఇంటికి రాగానే, మా గేటు కాపలాదారు మైక్‌ను పిలిచి అదేమిటని అడిగాను. ఆ ముసలివాడు ఈడ్చుకు వెడుతున్న శవపేటికలో శవం వుండి వుంటుందని నేననుకున్నాను.

"అది కాదమ్మా! కలపసామాను కొట్టునుంచి వాడు అప్పుడే శవపేటికను కొనుక్కు పోతున్నాడన్నమాట" అన్నాడు మైక్!

"ఐతే, మీలో ఎవరైనా అంగడికి వెళ్ళి శవపేటిక ఒకటి కొని తెచ్చేసుకోవచ్చునా? మాటవరుసకు, మీ అత్తగారి పీడ వదల్చుకోవాలనుకుంటావనుకో...చల్లగా ఆమెను చిటికెలో గుటుక్కుమనిపించి, బండీకి ఎత్తివెయ్యగలవా?" అన్నాను.

శవపేటికను కొనుక్కోవాలంటే, అందుకు సర్టిఫికేటు ఒకటి చూపించాలన్నాడు మైక్. కాని, అతడిమాటలు బట్టి అదేమంత కష్టమైన పనిగా తోచలేదు.

కర్కా సతీమణి మూడు మాసాలపాటు మాస్కో నగరంలో లేదు. అమెరికా వెళ్ళింది. ఈ మూడు మాసాలలో ఒక మాసం రోజుల పాటు ఆమె తన మనుమ లిద్దరిదగ్గర (వీ రిద్దరూ కర్కా సతీమణి రష్యాలో వుండగా పుట్టారు) ఖులాసాగా గడిపింది. ఆ తరువాత ఆమె ఓడలో యూరపుకు తిరిగి వచ్చింది. పారిస్‌నుంచి స్టాక్ హోం నగరంవరకు రైలులో ప్రయాణం చేసింది. దరిమిలా రెండు రాత్రులు రైలులో ప్రయాణంచేసి లెనిన్‌గ్రాడ్ నగరానికి, అక్కడ నుంచి మాస్కో నగరానికి తిరిగి చేరుకుంది.

మే 26, 1950

తిరిగి రష్యా చేరుకున్నాం. ఈలోగా ఇక్కడ వచ్చిన మార్పులంటూ అట్టే ఏమీ లేవు. శ్వాసోఛవనాన్ని పైనుంచి కిందివరకు చైనా పనివాడు చిన్ శుభ్రంచేసి వుంచాడు. ఐతే, ఒక్క విషయం మాత్రం చెప్పాలి.

శ్వాసోఛవనం కిందిభాగాన్ని పరిశుభ్రంగా, అందంగా వుంచడం చాలా కష్టమైన పని. అక్కడంతా ఎంత బాగా కడిగి, వెల్ల వేయించినప్పటికీ, అక్కడవుండే క్రిమికీటకాలన్నీ ఆ సమయంలో మాత్రం అవతలకు తప్పుకుని, ఆ తరువాత తిరిగి చేరుకుంటాయి. వీటికితోడు ఎలుకలబాధ కూడాను!

నేను న్యూయార్కులో వుండగా, మేము మామూలుగా సామానులు కొనుక్కునే కొట్టుకు టెలిఫోనుచేసి "ఎలుకల బోను లున్నాయా మీ దగ్గర?" అని అడిగాను.

ఆ షాపులో పనిచేస్తున్న అమ్మాయి, "చూస్తాను, వుండండి" అని సమాధానం చెప్పి, "మీ కెన్ని కావాలి? నాలుగా? ఐదా?" అని అడిగింది.

"అబ్బే! నాలుగూ కాదు, ఐదూ కాదు! మూడుడజన్లు కావాలి!" అన్నాను.

ఈ మాటలు వినేసరికి ఆ అమ్మాయికి అమాంతంగా స్పృహతప్పినంత పనైపోయింది. సరే, మూడు డజనుల ఎలుకలబోనులు పంపింది.

జూన్ 10, 1950

పోలీసులు మురుగు కాలవలోనుంచి ఒక శవాన్ని బయటికిలాగి, ఆ శవం చేతులు పుచ్చుకుని వీధివెంట ఈడ్చుకు

వెడుతూ వుండటం నిన్నను నా కళ్ళపడింది. అదృష్టవశాత్తు, నే నాసమయంలో కారులో కూర్చుని వున్నాను. అంతేగాక, చత్వారం కూడా వుండటంవల్ల ఆ భయంకరదృశ్యం పూర్తిగా నాకళ్ళ పడలేదు. ఆ మరణించిన వాని తల వెనుక భాగమంతా చితికి డొప్పలాగా అయిపోయి వుండటంమాత్రం గమనించాను. ఇంకా అతడిలో ప్రాణం ఏమీ మిగిలివుండదనే నిస్సందేహంగా చెప్పవచ్చు; ఒకవేళ ఏమైనా మిగిలివున్నా కాని, పోలీసులు ఆ విధంగా ఈడ్చుకుపోవడంలో ఆ కాస్త ప్రాణంకూడా పోయి తీరుతుంది. ఆ చుట్టుపక్కల వున్నవారు, ఇంత దారుణమైన దృశ్యాన్ని చూస్తున్నప్పటికీ కలతచెందినట్టు కనుపించలేదు; కనీసం ఆశ్చర్యాన్నైనా ప్రకటించలేదు.

ఇలాగే, ఒకటి రెండుమాసాలక్రితం, ఉద్దేశపూర్వకంగానో, లేక ప్రమాదవశాత్తునో ఒకమనిషి మాస్కోనదిలో పడటం తాను గమనించానని బ్రిటిష్ రాయబారి కార్యదర్శులలో ఒకడు నాతో చెప్పాడు. తానేమైనా రక్షించగలనేమోనని అక్కడికి వెళ్ళి చూచేసరికి, ఒక పడవ ఆ నదిలో పడిన వ్యక్తిని తప్పుకుని వస్తున్నదట! ఆ దృశ్యంచూచి ఆయన నిశ్చేష్టుడైపోయాడు. పడవలో వున్న ఒక మనిషి ముందుకు వంగి, నీళ్ళలో పడివున్న మనిషికి పగ్గం తగిలించాడు. ఆ విధంగా అతడిని ఒడ్డుకు ఈడ్చారు. ఒడ్డుకు చేరగానే అతడిని ఒక పాతగోనె సంచీని పారవేసినట్లు ఒకమూల పారవేశారు. అంతేగాని, శ్వాసను కల్పించడానికైనా ఎవ్వరూ ప్రయత్నించలేదు. ఐతే, అప్పటికే సమయం మించిపోయి వుండవచ్చు. ముఖ్యంగా, అతడిని నీటిలోనుంచి ఒడ్డుకు ఆ విధంగా ఈడ్చుకు

రావడంవల్ల ఇటువంటి విషమపరిణామం ఏర్పడి వుంటుంది. ఈ రాక్షస విధానాన్ని కళ్ళారా చూచి ఆ ఆంగ్లేయుడు హడిలి పోయాడు.

శ్చాసోభవనం వున్న వీధిలో కొంచెం ఎగువను ఒక భవనానికి "సారా నిషావదిలించే కేంద్రం నెం. 9" అనే బోర్డు ఒకటి తగిలించి వుంది. రష్యన్ భాషలో ఆ బోర్డుపైన వ్రాసివున్న మాటలకు ఇది అనువాదం మాత్రమే. ఆ ప్రాంతంలో మద్యం తాగివున్న వాళ్ళనందరినీ ఇక్కడకు పట్టి తెస్తారు. క్రితం వారం నేను అటువైపునుంచి వెడుతూవుండగా, ఒక మనిషిని పాతగుడ్డల మూటను విసరివేసినట్లు కారులో నుంచి కిందికి విసిరి, అక్కడినుంచి అతడిని లోపలికి ఈడ్చుకు పోయారు. పాపం! ఈ అభాగ్యులకు ఏమి చికిత్స చేస్తారో మనం కేవలం ఊహించవలసిందే. కాని, నడి వేసవికాలపురోజుల్లో కూడా ఈ భవనపు కిందిభాగం కిటికీలోనుంచి నీటి ఆవిరి మేఘాలు బయటికి వస్తూవుండేవి. అంటే, ఎల్లప్పుడూ అక్కడ నీరు మరగబెడుతూ వుంటారన్నమాట. దీనినిబట్టి, తాగుడు నిషాలో వున్నవారిచేత ఆవిరి పట్టిస్తారేమోనని నేను ఊహిస్తున్నాను. తప్పతాగడం పాతకాలపు రష్యాలో పరిపాటి అయిన విషయమే. ఇటువంటివారిలో ప్రమాదరహితులయిన వారిని పోలీసులుకూడా చూచీ చూడనట్లు వూరుకుంటూ వుండేవారు. తప్ప తాగి, రాకపోకల నియమాలను అతిక్రమించినా, ఇతరులను బాధపెట్టినా ఎక్కువగా జరిమానాలు విధించడమో, ఖైదులోపెట్టడమో చేసేవారుగాని, బలవంతాన వారిచేత ఆవిరిమాత్రం పట్టించేవారు కాదు.

జాగోర్‌స్క్ రోడ్డువెంట వెడుతూ నిన్న చాలా వెట్టిచాకిరీ కార్మికుల ముఠాలను చూచాము. అక్కడ వారు జరుపుతున్న నిర్మాణాలను, చుట్టూ ముళ్ళతీగెలున్న ఆ ఆవరణలోని అజమాయిషీదారుల గృహాలనుకూడా మేము గమనించాము. ఇంతమాత్రంచేత, ఈ పని అంతా రష్యాలోని ఖైదీలచేతనే చేయించబడుతున్నదని కాదు. పని అయిపోగానే పనివాళ్ళు సామానులు ఎత్తుకుపోకుండా వుండడానికిగాను చాలాచోట్ల ఇలా ముళ్ళతీగెల ఆవరణలు ఏర్పాటుచేయబడి వుండవచ్చు. కాని, మేము చూచినచోట మాత్రం ఖైదీలు తప్పుకుపోకుండా వుండడానికై ఎంత జాగ్రత్త అవసరమో అంత జాగ్రత్తగా ముళ్ళతీగె నిర్మించబడి వుంది.

ఇంజనీరు ఒకతె నాలుగు రోడ్డులు కలిసేచోట నిలబడి కొందరు పనివాళ్ళను అదలిస్తున్నది. కాని, అప్పుడుకూడా ఆ పిల్లమాత్రం చాలా సంతోషంగానే వుంది. ఆమె ముఖంలో దయాదాక్షిణ్యాలు ఏ కోశానా కనుపించడంలేదు. అక్కడ వున్న మొగవాళ్ళందరి ముఖాలకంటె, ఆమె పక్కని తుపాకిపుచ్చుకు నిలబడ్డ రహస్యపోలీసు (ఎమ్. వి. డి) ముఖం కంటె కూడా ఆమె ముఖమే కర్కశంగా వుంది.

జులై 2, 1950

కొరియాలో కమ్యూనిస్టుల దురాక్రమణపై భద్రతా సంఘం తీసుకున్న చర్యను గురించి అధికార పూర్వకంగా తెలియజేయడానికిగాను గ్రోమికోను నాభర్త ఇంటర్వ్యూ కోరారు. కాని, ఇందుకు సమాధానమేమీ రాలేదు. భద్రతా సంఘం దరిమిలాచేసిన రెండవ తీర్మానాన్ని, ప్రెసిడెంట్

బ్రూామన్ ఉత్తర్వును అందజేయవలసివుండడంవల్ల ఇంటర్వ్యూ ఇవ్వవలసిందని గ్రోమికోను నాభర్త మరొకసారి కోరారు. అప్పటికీ సమాధానం రాకపోయేసరికి, రష్యా విదేశాంగమంత్రి కార్యాలయానికి ఒకలేఖనిచ్చి ఎడ్ఫ్రీర్స్‌ను పంపి, అక్కడి ఉద్యోగులలోఎవరుకనిపిస్తే వారికిదానిని అందజేసిరమ్మన్నారు.

శుక్రవారంనాడు గ్రోమికోను నాభర్త చూడగలిగారు. అంటే, అప్పటికి ఆయన సమాధానం సిద్ధమయివుంటుం దన్నమాట—భద్రతాసంఘం జరిపిన చర్య అక్రమమైనదట. ఉత్తరకొరియా దురాక్రమణ జరపనేలేదట—ఇదీ, రష్యావారు తయారుచేసిన సమాధానం! ఇది సర్వస్వాతంత్ర్యంగల ఒక దేశానికి సంబంధించిన విషయం గనుకను, "ఇతరదేశాల ఆంతరంగిక వ్యవహారాలలో ఎన్నడూ జోక్యం కలిగించుకునే అలవాటు సోవియట్ ప్రభుత్వానికి లేదన్న విషయం సువిదిత సత్యం" గనుకను ఈ కొరియా విషయంలో తాము జోక్యం కలిగించుకొనబోమని కూడా ఆ లేఖలో తెలియజేయబడింది!

ఈ సమాధానాన్నంతా నాభర్తకు గ్రోమికో చదివి వినిపించాడు. కాని, ఇందులోని విషయాలను గురించి వారేమీ చర్చించలేదు. చాలా ముఖ్యులైన సోవియట్ మంత్రులకు కూడా పైనుంచి హుకుములు జారీ అవుతూనే వుంటాయి. వీటిని గురించి వారు తమపైవారిని ప్రశ్నించలేరు, ఇతరులకు వివరించి చెప్పనూలేరు! ఆ ఇంటర్వ్యూలో వారు చర్చించిన ఏ ఒక్క విషయమూ కొరియాకు సంబంధించినది కాదు— సోవియట్ ప్రభుత్వపు ఆర్థికశాఖవారు గత శీతకాలంలో డాలర్లుగా మారకం చేసుకొని వుండవలసిన సుమారు పదిలక్షల

రూబుల్స్‌ను గురించి వారు చర్చించారు. ఈ దేశంలో మా రాయబార కార్యాలయాన్ని నిర్వహించడానికి, ఇక్కడి పని వారికి జీతాలివ్వడానికి, ఇంకా ఇతరమైన ఖర్చులకు ఈ ధనం వినియోగించబడింది. రూబుల్ క్రొత్తమారకపు రేటు అమలులోకి వచ్చేవరకు, ఈ ధనాన్ని వినియోగించుకోనకుండా సోవియట్ ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగా నిల్వవుంచింది. ఇందువల్ల అమెరికాకు రెట్టింపు వ్యయమయిందన్నమాట.

వాషింగ్టన్‌లో వున్న సోవియట్ రాయబార కార్యాలయ భవనం అద్దెనుకూడా రెట్టింపుచేయించి ప్రతీకార చర్య జరపడానికి వీలులేనందుకు తనుచాలా విచారిస్తున్నానని గ్రోమికోతో నా భర్త చెప్పారు. జార్ ప్రభుత్వకాలం నాటి ఆస్తినంతనూ సోవియట్ రష్యాకు అప్పగిస్తూన్న సమయంలో, దురదృష్టవశాత్తు ఆ భవనాన్ని కూడా వారికి మేము అప్పగించడం జరిగింది.

"మీరు నిజంగా రెట్టింపు చేసివుందురా?" అన్నాడు గ్రోమికో.

"తప్పకుండా చేయించి తీరుదును" అని నా భర్త జవాబిచ్చారు.

జులై 3, 1950

రేడియో మోగుతున్నది. చివరకు పరిస్థితులన్నీ ఎలా పరిణమిస్తాయో ఎవ్వరూ ఊహించనలవిగాకుండా వున్నాయి.

ఈ పరిస్థితులు చాలవన్నట్లు, పంటలను నాశనంచేసే క్రిములను తూర్పు జర్మనీలో అమెరికా విమానాలు వెదజల్లుతున్నట్లు రష్యన్‌లు అధికారపూర్వకంగా నిరసనను

తెలియజేశారు. ఇటువంటి విషయాన్ని ఇంత తీవ్రమైన ధోరణిలో తెలియజేయడం పరిహాసాస్పదమైన విషయం. జర్మనీలో బంగాళాదుంపలు పండుతున్న పొలాలపైన అమెరికా విమానాలు ఈ విషక్రిములను వెదజల్లుతున్నట్లు ఈవిషయంలో జరిగిన విచారణవల్ల వెల్లడయిందని వారంటున్నారు. తూర్పు జర్మనీ చేసిన ఫిర్యాదును, దానితోబాటు ఇటువంటి దుశ్చర్యలను కట్టిపెట్టవలసిందనీ, ఇందుకు కారణభూతులైన వారిని శిక్షించవలసిందనీ ఆ దేశం కోరినకోర్కెను రష్యనులు మూ కందజేశారు.

ఐతే, ఇదంతా పచ్చి అబద్ధమని ఆ అధికారులకు తెలియకపోలేదు. అలాగే, ఇదంతా అబద్ధమని మాకూ తెలుసు. కాని, గత ఆరువారాలుగా ఈ విషయాన్ని గురించి వారు చెవినిల్లు కట్టుకొని పోరుతూవుండడం వల్లను, ఇప్పుడు ఈ ప్రచారానికి ప్రభుత్వ ప్రోత్సాహాన్ని కూడా ఇస్తూవుండడం వల్లను ఇక్కడున్న అజ్ఞానులు చాలామంది, జర్మనీలోని ప్రజానీకంలో కొంతమంది ఆ ఆరోపణలను నమ్ముతారు. బంగాళాదుంపలపంట తెగుళ్ళు ఇంతకుపూర్వం చాలా శక్తిమంతంగా నిరోధించబడేవనీ, కాని ఇప్పుడు అటువంటి విధానాలు అవలంబించబడకపోవడం వల్లను, రష్యన్ విధానాలు పూర్వపు వాటంత పాటవంగలవి కాకపోవడం వల్లను ఆపంటకు తెగుళ్ళు విచ్చలవిడిగా పడుతున్నాయనీ మా వాళ్ళ అభిప్రాయం.

విదేశ రాయబార కార్యాలయాలలో పనిచేస్తున్న పనివారందరూ ట్రేడ్ యూనియన్ హాలులో సమావేశమై శాంతినిగురించి, అందుకై సోవియట్ యూనియన్ జరుపుతున్న

కృషిని గురించి ఇవ్వబడే ఉపన్యాసాలు వినవలసిందని నిన్న ను. శాఖీయులు వచ్చాయి. ఆ తరువాత వారందరిచేత స్టాక్ హోం ప్రణాళికపైన సంతకాలు చేయించారు. ఆ ప్రణాళికపైన చేయబడిన సంతకాలన్నీ ఆవిధంగా సేకరించబడినవే! అసలు ఇదంతా తెలివితేటలతో జరిపిన వచ్చిమోసం. మనమంతాకూడా శాంతికి సుముఖులుగా వున్నమాట వాస్తవమే. కాని, ఇటువంటి శాంతిసాధన ఏయే సూత్రాల కనుగుణంగా జరగాలి అన్న విషయాన్ని ప్రపంచమంతటా ఆ ప్రణాళికపైన సంతకాలు పెడుతున్న నిర్భాగ్యులు, విజ్ఞాన హీనులు అయిన జనసామాన్యం గుర్తించలేకుండా వున్నారు.

కెనడా రాయబార కార్యాలయంలో నిన్న జరిగిన కాక్ టెయిల్ పార్టీకి వచ్చిన పెద్దపెద్ద రష్యన్ సైనికోద్యోగు లందరూ ఆదరాబాదరా తిరిగి వెళ్ళిపోవడం చాలా తమాషాగా వుంది. పెందరాడే భోజనాలకు ఇళ్ళకు వెళ్ళవలసిందని మా కందరకూ హెచ్చరిక చేయబడింది. మేమెందుకిలా పెందరాడే వెళ్ళి భోజనాలు ముగించుకోవాలంటే — ఆ తరువాత మా పనివాళ్ళు వెళ్ళి మాకు వ్యతిరేకంగా వోటు చేయవలసి వున్నది గనుక, అని ఇందుకు సమాధానం చెప్పుకోనవలసి వుంటుంది! నిజంగానే ఇది చాలా విడ్డూరమైన విషయం.

ఈలోగా, జులై నాలుగవ తేదీన (అమెరికా స్వాతంత్ర్య దినం) మేము ఏర్పాటు చేయదల్చుకున్న బాల్ డాన్సుకు సన్నాహాలు జరుపుతున్నాము. మొత్తం 350 మంది వరకు అతిథులు వస్తారని అనుకుంటున్నాం. అసలు 375 మందివరకు రావచ్చు. కాని, కొన్ని రష్యా ఉపగ్రహరాజ్యాల వారికి ఆ సాయంత్రం వంట్లో బాగుండకపోవచ్చు!

జులై 5, 1950

క్రెమ్లిన్‌కు ఎట్టఎదుట అమెరికన్ పతాకాలు నిన్నే ఎగురుతూ వుంటే చూడముచ్చటగా వుంది. నిన్నను గాలి కూడా చాలా బాగుంది. అమెరికన్ పతాకం సొగసులీనుతూ గాలిలో విహరించింది.

జులై నాలుగవ తేదీ అభినందనలను మాకు అందజేస్తూ గ్రోమికో చేసిన ఉపన్యాసం ఎంతో మందకొడిగా వున్నట్లని పించింది మాకు. ఆ ఉపన్యాసం కేవలం పరిహాసాస్పదమైనది. గ్రోమికో చెప్పదల్చుకున్న విషయంలో కొంతభాగాన్ని మాత్రమే చెప్పాడు. కాని, చెప్పి వుండవలసిందికూడా వాస్తవిక విషయాలకివ్వబడిన వికృత స్వరూపమే! తన దేశస్థులలో చెలామణి చెయ్యడం కోసం, వారి నైతికశక్తిని పొగడడం కోసం ఆ ఉపన్యాసాన్ని తయారుచేసినప్పటికీ—అది అన్నీ తెలిసిన ఒక వ్యక్తి తయారుచేసిన తప్పుల తడక ఉపన్యాసం; నిరాశాపూరితమైన ప్రకటన.

ఆయనగాని, ఆయన ఉపమంత్రులలో మరెవ్వరైనాగాని బాల్‌డాన్సుకు వస్తారా, రారా అని అనుమానించాము. వారెవ్వరూ రారని నా భర్త పందెం గెలిచారు కూడాను. ఏడెనమండుగురు రష్యనులు మాత్రం వచ్చారు. వీరందరూ సామాన్యోద్యోగులే. ఒక అరగంటసేపు మాత్రం వుండి, ఆపైన కేవలం లాంఛనప్రాయంగా కరచాలనం చేసి వెళ్ళిపోయారు. వీరంతా ఉట్టి చెత్తా కానీ రకంలాగా కనుపించారు; రెండవరకం సజ్జు అయివుంటారని కచ్చితంగా చెప్పవచ్చు! అసలెవ్వరూ రాకపోవడం కన్న, ఇటువంటివారు

రావడమే మరీ అవమానకరమైన విషయం. నిజంగా దీనినిబట్టి వీరెంత నమ్మరానివారో విదితమాతున్నది.

మాస్కోలో కారులో ప్రయాణం చేస్తున్నప్పుడు కారు ఎడమవైపుకు మళ్ళడానికి నా భర్తకు ఇవ్వబడిన ప్రత్యేకానుమతి ఉపసంహరించబడింది. సోవియట్ ప్రభుత్వం మా పట్లకినుక వహించినట్లు నిజంగా ఇందువల్ల తెలిసిపోతున్నది.

జులై 7, 1950

సోవియట్ ప్రభుత్వ స్వభావం నానాటికీ మరింత దిగనాసిల్లుతున్నది. మొన్నను మా రాయబార కార్యాలయం ముందు ఎగిరిన జండావల్ల వారు నిజంగా చికాకు పడివుంటారు. తూర్పుజర్మనీ అంతటా బంగాళాదుంపల పంటకు తెగులు పుట్టించే క్రిములను మేము వ్యాపింపజేస్తున్నామనే హాస్యాస్పదమైన ఆరోపణకు తోడు, ఐక్యరాజ్యసమితి కాందిశీక పునరావాస సంస్థద్వారాను, అరువుకోలు సరఫరాలద్వారాను మేముఅన్నిరకాలైన విషక్రిములను జర్మనీలోనికి తెస్తున్నామని ప్రచారం చేయడానికి ఇప్పుడు రష్యావారు సాహసిస్తున్నారు.

ఈ ఆరోపణలను ఖండించడానికి అవకాశంలేదు; ఒక వేళ ఏమైనా అవకాశాలున్నప్పటికీ, అటువంటి ఖండనలవల్ల, ఆ ఆరోపణలపైన కొందరికి నమ్మకం చేకూరే ప్రమాదమున్నది కూడాను. ఈ విషక్రిములను గురించిన వాస్తవిక విషయాలను తెలియజేస్తూ వాయిస్ ఆఫ్ అమెరికా రేడియో ప్రసారాలు వెలువడుతున్నప్పటికీ ఈ దేశంలోని ప్రజాసామాన్యానికి బయటి ప్రపంచంలోని విషయాలేవీ తెలిసే అవకాశం లేదు. వీరిని బయటివారు కలుసుకొనడానికిగాని, వీరిలో తమ ప్రభుత్వం

కల్గిస్తున్న అపోహలను తొలగించడానికిగాని ఏ విధంగానూ వీలు లేదు.

ఇంటిపట్టున కూర్చుని అంతర్జాతీయ పరిస్థితులనుగురించి అదేపనిగా ఆలోచించేకంటె వచ్చేవారంనుంచీ ప్రతిరోజూ ఒకపూట రాయబార కార్యాలయపు గ్రంథాలయంలో పని చేయదల్చుకున్నాను. ఒక నెలజీతంతో పనివాళ్ళకు సెలవు లివ్వడం ప్రారంభమయింది. సరే, డాలర్ మారకపు బాధ చెప్పనవసరమే లేదు. మొన్నను పువ్వులు కొనడంకోసం చాంటాల్ గోఫిన్‌తోబాటు మార్కెట్టుకు వెళ్ళినప్పుడు అక్కడ నుంచి తాజాకూరలుకూడా కొన్ని కొని తెద్దామనుకున్నాను. కాని, టొమాటోలు, స్ట్రాబెర్రీలు పౌండు మూడుడాలర్ల చొప్పున అమ్మడం చూచి గుడ్లు తేలవేసి చక్కా వచ్చాను.

రష్యన్ షాపులలో ఏ వస్తువులనూ కొనడం మనవల్ల కాదు. మన కరువుభత్యం పెరిగినప్పటికీ, ధరలు మనకు ఎంత మాత్రమూ అందుబాటులోవుండవు. వాషింగ్టన్ మార్కెట్టులో "సోవియట్లకు మాత్రమే" ఒక ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేసి, వారిచేతకూడా ఇటువంటి ధరలకే మా వస్తువులను కొనిపించే మార్గమేదైనావుంటే బాగుండుననిపిస్తున్నది నాకు.

జులై 12, 1950

భోజనాలు అయిపోగానే నా భర్త చాలా పెద్ద పని వున్నట్లు మేడపైకివెళ్ళి ముదరరంగు సూటు, బిగుతైన కాలరు ధరించి చక్కగా తయారై కిందికి దిగివచ్చారు. అంటే, రష్యా విదేశాంగ కార్యాలయానికి ఆయన ఏదో పనిమీద వెళ్ళవలసి వున్నదన్నమాట! గత కొద్దిరోజులుగా ఏవో "రాజకీయ

"కార్యకలాపాలు" కొన్ని నడుస్తున్నట్లు మేము పసికట్టాము. బ్రిటిష్ రాయబారి సర్ డేవిడ్ కెల్లీకి, గ్రోమికోకు మధ్య మంతనాలు జరగవచ్చునని వెలువడిన వార్తకు, నా భర్త తయారయిన ముసాయిదాకు దగ్గర సంబంధ మున్నట్లున్నది!

కాని, కొరియాయుద్ధం ఇంత తేలికగా పూర్తి అవుతుందని భావించడం కేవలం భ్రమ. కొరియా ఉదంతం ఇప్పుడొక సంఘటన కాదు; ఒక యుద్ధం.

నిన్నటి విందుకు కెనడా రాయబార కార్యాలయాన్నుంచి వచ్చిన ఒక యువతి, వీధిలో ఎవరో ఒకపెద్ద నాను రొట్టెముక్కను తనపై విసిరికొట్టారని చెప్పింది. నిజానికి, ఇటువంటి సంఘటన జరగడం ఇదే మొదటిసారి. అది ఏదో ప్రమాదాన్ని గురించి హెచ్చరించడమై వుంటుందని ఆమెకు మరీ మరీ చెప్పాను. కాని నా మాటలకు ఆ అమ్మాయి సంతృప్తిచెందలేదు. ఆ రొట్టెముక్కను తనపైకే గురిపెట్టారనీ, చాలా బలంగా విసరికొట్టారనీ కూడా ఆమె చెప్పింది.

కొరియా పోరాటం ప్రారంభం కాగానే, మొఖోవాయా భవనం (అమెరికా రాయబార కార్యాలయభవనం) గేటు కాపలావాళ్లు, అక్కడ డ్యూటీలోవున్న పోలీసువాళ్లు నా భర్త కారులో వెడుతున్నప్పుడు వందనంచేయడం మానివేశారు. రోజర్‌గాని, డిక్‌గాని లోపలికి వస్తున్నా, బయటికి వెడుతున్నా వారిని పలకరించడంకూడా మానివేశారు. సరిగ్గా ఒక వారంరోజుల తరవాతనుంచీ మళ్ళీ యథావిధిగా వందనం చేయడం మొదలుపెట్టారు! కాని, నా భర్త మామూలు రాకపోకల నియమాలన్నిటికీ బద్ధుడై తన కారులో ప్రయాణం చేయాలనే నియమంమాత్రం ఇంకా అలాగే వుంది.

నగరమంతటా, బిల్లుబోర్డులపైన, అంగడి కిటికీలలోను "మిర్" (శాంతి) అని వ్రాసివున్న బ్రహ్మాండమైన పోస్టర్లను ప్రదర్శించారు. ఇటువంటి పోస్టర్లు చాలా వాటిలో ఎఱ్ఱ జెండాకు ఎదురుగా బిగించిన పిడికిలి చిత్రించబడి వుంటుంది. ట్రూమన్, చర్చిల్ చిత్రాలు పోస్టరులో కింద ఒకమూలగా వుంటాయి. ఎంత నమ్మతగ్గ శాంతిప్రచార మిది!

జులై 13, 1950

ఇంతాచేసి, నా భర్త వెళ్ళింది రష్యా విదేశాంగ కార్యాలయానికి కాదు; ఇండియా రాయబారిని కలుసుకొనడానికి! ఈ ఇండియా రాయబారి ప్రఖ్యాత తత్వశాస్త్రవేత్త; పూర్వం ఆక్స్‌ఫర్డు విశ్వకళా పరిషత్తులో ప్రొఫెసరుగా పని చేసిన వాడు; చాలా నిశ్చితమైన అభిప్రాయాలు, మంచి ధైర్యసాహసాలు గలవాడు. ఉత్తర కొరియా దండయాత్ర విషయంలో నిరసన తెలుపడానికిగాను గ్రోమికోను కలుసుకున్నది ఆయనే. రాయబారాలు జరపడానికి ఏమైనా అవకాశమున్నదేమోనని కూడా ఆయనే తాపత్రయపడుతూ వుండి వుంటాడని నేను కచ్చితంగా చెప్పగలను. గంటన్నరసేపు చాలా ఉన్నత స్థాయిలో సంభాషణ జరిపి నా భర్త తిరిగి వచ్చారు. ఐతే, వీరి సంభాషణఅంతా వాస్తవిక విషయాలకు చాలా అతీతంగా వుంది. నిజానికి, శాంతికి భంగకరంగా ప్రవర్తించడమే ఒక ప్రబలవిధానంగా పెట్టుకున్న ప్రజలకు-వాళ్ళు పోస్టర్లలో చిత్రించినట్లు పిడికిలి బిగించిన ప్రజలకు—ఉత్తేజకరమైన విజ్ఞప్తులు చేసి ప్రయోజనం లేదేమోననిపిస్తుంది!

రష్యా, అమెరికా దేశాల రాయబారులు ఇరువైపుల ఉపసంహరించుకొనబడుతారని చాలా మంది రేడియో

వ్యాఖ్యాతలు సూచించారు. కాని, అలా జరగడానికి మాత్రం ఎప్పుడూ అవకాశాలు వుండనే వున్నాయి!

నా భర్తతోబాటు కారులో వెడుతుంటే ఈ మార్పు కనుపిస్తుంది. దారిని పోతున్న వాళ్ళు మా జండాను చూచి, ఇతరులకు చూపెట్టి, ఇంకా జాగ్రత్తగా దానివైపే చూస్తూ వుంటారు.

మా రాయబార కార్యాలయం ముందు నిన్న ఒక తమాషా జరిగింది. అక్కడ కాపలా వున్న పోలీసు దగ్గరకు తప్పతాగివున్న ఒక రైతువచ్చి, "యుద్ధోన్మాది వుండేది ఇక్కడేనా?" అని అడిగాడు. అతడిని అవతలకు నెట్టివేదామని పోలీసు ప్రయత్నించాడు. కాని ఆ రైతు మోకాళ్ళపైన నిలబడి, పోలీసుచేతిని ముద్దు పెట్టుకుని "మమ్మల్ని సంరక్షిస్తున్నందుకు కృతజ్ఞుణ్ణి, కామ్రేడ్!" అన్నాడు.

జులై 25, 1950

ఇటీవల రాత్రిపూట మాకు ఆదమరచి నిద్రపట్టటమే లేదు. వేడిగాడ్పులతో ఉక్కపోస్తూవుండడము, ఉదయం మూడు గంటలకే సూర్యోదయమై ఎండ వస్తూవుండడము ఇందుకు మొదటి కారణం. అదీగాక, ఒకసారి మెళుకువ వచ్చిందంటే మళ్ళీ నిద్రపట్టకుండా అనేక ఆలోచనలు అదే పనిగా మనసులో మెదులుతున్నాయి. కొరియా నుంచి వస్తున్న వార్తలు చాలా బాధాకరంగా వున్నాయి.

ఐదు రోజులపాటు జర్మనీలో వుండిరావడానికి నా భర్తకు అమెరికా విదేశాంగ కార్యాలయంనుంచి అనుమతి వచ్చింది. మా విమాన ప్రయాణానికి రష్యన్ ప్రభుత్వంవద్ద నుంచి అనుమతి పత్రాన్ని తెచ్చుకోవలసివున్న దిప్పుడు. ఈ

అనుమతి పత్రానికై చివరి క్షణాలలో ఆదుర్దా పడడం ఎప్పుడూ తప్పడంలేదు. రష్యాను వదిలి వెడుతుంటే, ఖైదు శిక్ష ననుభవిస్తున్న వ్యక్తికి అధికారుల దయ కారణంగా ఒక వారం రోజులపాటు సెలవు లభించి బయటపడుతున్నట్లు నాకు అనిపిస్తున్నదని నా భర్తతో చెప్పాను. బయటి ప్రపంచాన్ని ఒకసారి చూశాక మళ్ళీ తిరిగి ఇక్కడికి రావడం చాల కష్టమైన విషయమని చెప్పకతప్పదు. అసలు బయటి ప్రపంచంతో మాకుగల సంబంధాలన్నీ క్రమంగా తెగతెంపులై పోతున్నాయి. ఇక్కడివారికీ, మాకూ భావాలలోను, అభిరుచులలోను, చివరికి అంతఃకరణకు సంబంధించిన విషయాలలోను కూడా ఒక పెద్ద అగాధమేర్పడి అది మరింత విస్తృతమౌతున్నట్లున్నది!

జులై 27, 1950

కొరియారంగంలో పరిస్థితులు కుదుటపడినట్లు పత్రికలలో చదివాము. ఈ విషయం నిజమైనందువల్లనే, రష్యా పోలీసులు నా భర్తకు మళ్ళీ యథాప్రకారంగా నమస్కారం చేస్తూ వుండివుండవచ్చు! పనివాళ్ళుకూడా నవ్వు ముఖాలతో కనుపిస్తున్నారు.

మా నాటి రాయబార కార్యాలయోద్యోగులలో ఒకడు తమవద్ద గత పదహారు సంవత్సరాల నుంచీ బట్లరుగా పనిచేస్తున్న ఒక ముసలివాణ్ణి పనినుంచి మాన్పించివేయవలసి వచ్చింది. అతడికి విదేశస్థులెవ్వరిదగ్గరా పనిచేయకూడదని రష్యాప్రభుత్వం దగ్గరనుంచి తాఖీదు వచ్చింది. ఇందుకు ఏ విధమైన కారణాన్నికూడా వారు సూచించ లేదు. ఆ బట్లరు చాలా వయసుమీరినవాడు; నా అనే వారెవ్వరూ లేనివాడు

కూడాను. అంటే, కూటికి మొహం వాయటం అతడికి రాసి పెట్టి వున్నదన్నమాట! అతడి గతచరిత్ర కారణంగా, అతడి కెక్కడైనా వేరే పని దొరికే ఆశ కూడా లేదు; అటువంటి వారికి సాయపడడానికి ప్రయివేటు ధార్మికసంస్థలు కూడా ఈ దేశంలో ఏమీ లేవు. తను ఇంత కాలాన్నుంచీ చాలా పదిలంగా దాచుకుంటున్న రెండు కాగితాలను పట్టుకొచ్చి ఆ రాయబారి చేతికిచ్చి తన కళ్ళ ఎదటే వాటిని భస్మంచేసి వేయమని కోరాడు. ఇందులో ఒకటి, రాజభవనంలో పని వాడుగా తను చూపిన ప్రతిభకుగాను, చచ్చి స్వర్గాన్ని చేరుకున్న రాజవంశీయు డెవరో వ్రాసి యిచ్చిన ప్రశంసా పత్రం. రెండవది, తన కుమారుని పుట్టుకను గురించిన సర్టిఫికేటు. ఆ రాజవంశీయుని ఎస్టేటులోనే ఇతడు జన్మించాడు. దరిమిలా ఇతడు జర్మనీకి వెళ్ళి అక్కడ చనిపోవడంగాని, ఎటో మాయమవడంగాని జరిగింది. ఆ తరువాత, ఆ రాయబారితో ఆ వృద్ధుడు కరచాలనం చేసి, ఒక చిన్న మూట బుజాన పెట్టుకుని తడబడుతూ నడిచివెళ్ళాడు. అతడు కూడా అలా వెళ్ళి వెళ్ళి చివరకు ఎక్కడో నేల కొరుగుతాడనీ, ఆర్బత్ వీధి మురుగుకాలవలోనుంచి శవాన్ని బయటికి లాగినట్లు అతడి భౌతిక దేహాన్ని కూడా ఏ మురుగుకాలవలో నుంచో బయటిలాగడంజరుగుతుందేమోననీ అనిపించిందినాకు.

ఆగస్టు 30, 1950

సెయింట్ లూయీచర్చిలో (ఇది ఫ్రెంచిచర్చి) పెరె థామస్ అనే ఫ్రెంచి మతగురువు కడసారి జరుపుతున్న పూజకు మొన్న శుక్రవారంనాడు హాజరైనాము. ఫ్రెంచి

విప్లవానికి పూర్వం ఈ చర్చి నిర్మించబడింది. ఒక కాలంలో ఈ చర్చి చాలా సిరిసంపదలతో తులతూగింది. ఒక ఆసుపత్రి, ఒక పాఠశాల కూడా ఈ చర్చికి అనుబంధంగా వుంటూ వుండేవి. నగరంలోని రోమన్ కాథలిక్ క్రైస్తవులు, విదేశస్థులు, స్వదేశస్థులు కూడా ప్రార్థనలు జరుపుకోన డానికి ఈ చర్చి ఉపయోగపడుతూ వుండేది. లిట్వినోవ్ ఒడంబడికి జరిగిన నాటినుంచీ, విదేశస్థుడైన మతగురువు ఒకడు (ఈయన సాధారణంగా ఫ్రెంచివాడుగాని, అమెరికన్‌గాని అయి వుంటాడు) ఇక్కడ దైవప్రార్థనలు నిర్వహించడానికీ, ఇక్కడనున్న రోమన్ కాథలిక్కుల మత అవసరాలపట్ల శ్రద్ధ వహించడానికీ అనుమతించబడింది. కాని, ఒక సంవత్సరం క్రిందట ఈ చర్చి పరగణాలోనివారు (parishioners) కొందరు పెరెథామస్ వద్దకు వచ్చి, ఈ చర్చికి సంబంధించిన బాధ్యతలు నిర్వహించడానికిగాను తాము ఒక కమిటీగా ఏర్పాటయినామని చెప్పి, చర్చి తాళంచెవులు తమ కివ్వ వలసిందని బలవంతపెట్టారు. రష్యన్ భాషను మాట్లాడే పోలిష్ మతగురువును ఒకనిని పిలిపించారు. అప్పటినుంచీ ఈ చర్చి వ్యవహారాలన్నీ వారిచేతిమీదుగానే నడుస్తున్నాయి. విదేశస్థులకోసం మాత్రం పెరెథామస్ కొన్ని గంటలపాటు అక్కడ పూజలు జరుపవచ్చు అంతే.

పాపం, పెరెథామస్ ఈనిబంధనలకన్నిటికీ తల వొగ్గక గత్యంతరం లేకపోయింది. దీనికితోడు, అతడు దేశంలో వుండడానికి వీలులేదనీ, దేశం వదలి వెళ్ళిపోవడానికి సిద్ధం కావలసిందనీ రష్యా విదేశాంగకార్యాలయంవారు గతవారం

ఒక తాఖీదు పంపించారు. సోవియట్ చర్చిలో సభ్యులుగా చేరిన వారు మినహాగా, ఆ చర్చి పరగణాలోని వారందరూ ఈ వార్త విని చాలా వ్యాకులపడ్డారు. ఇటువంటి వారందరి పరిస్థితి తల్చుకుంటే గుండె కరిగిపోతుంది. వీరిలో అధిక సంఖ్యాకులు పోలిష్‌వారు; దుర్భర దరిద్రులు. వారక్కడ వెళ్లదీస్తూన్న జీవితంపైన వారికి లవలేశం కూడా మమకారం లేదు. అందువల్ల, పరలోక జీవితంపైనే తమ ఆశలన్నీ కేంద్రీకరించుకుని వారు బ్రతుకుతున్నారు.

రోగిష్ఠి మనిషి ఒకావిడ 300 రూబుల్సును ఒక తుక్కు కాగితంలో చుట్టబెట్టి తీసుకొచ్చి తనకు ఇచ్చిందని పెరెథామస్ నాతో చెప్పాడు. ఆ డబ్బును తన అంత్యక్రియలకోసం నిల్వ చేసుకున్నాననీ, కాని, పెరెథామస్ ఇప్పుడు వెళ్ళిపోతూ వుండడంవల్ల కాథలిక్ కర్మకాండ ప్రకారం తన అంత్యక్రియలు జరిగే ఆశ లేదని తాను గ్రహించాననీ ఆమె తెలియజేసింది. కాథలిక్ పీఠాధిపతి పోపుకోసము, చనిపోయిన తన కుటుంబం వారికోసము, తన ఆత్మ విముక్తికోసము మూడుసార్లు చర్చిలో ప్రార్థనలు జరుపవలసిందని కూడా ఫెరెథామస్‌ను ఆమె కోరింది.

ప్రాచీనకాలపు ఫ్రాన్సుకు, ఈ చర్చికి ఇష్టదేవత అయిన సెయింట్ లూయీకొరకు జరిగే విందు కూడా శుక్రవారంనాడే కలిసివచ్చింది. ప్రార్థన పన్నెండుగంటలకు ఏర్పాటుచేయబడింది. మేము మా రాయబారకార్యాలయం నుంచి మొత్తం అరవైమంది బలగం వెళ్లాము. మా మత గురువు లందరూ కూడా ఆ సమయానికి తగినట్లు ఒకే

రకమైన దుస్తులు ధరించారు. వీరు వస్తూ వుండేసరికి, ఇక్కడ అసాధారణమైన విషయ మేదో జరుగనున్నట్లు పసి కట్టి, దారేపోతున్న వాళ్ళు, ఎదురుగుండా భవనాన్ని నిర్మిస్తున్న కార్మికులు అదే పనిగా చూడడం మొదలు పెట్టారు. మా కారులు చర్చి ఆవరణలోనికి వస్తూండేసరికి అక్కడంతా జనం గుమిగూడారు. నా భర్త వెంట వుంటున్న రష్యా రహస్య పోలీసులు నలుగురూ ముఖాలు ముడుచుకుని వెనుక గోడవారగా నిలబడ్డారు.

పోలిష్ మతగురువు మాత్రం సెయింట్ లూయీ చర్చిని నిర్వహిస్తూనే వున్నాడు. ఇతడు మతగురువు ఎంత మాత్రమూ కాడనీ, ఒక కీలుబొమ్మమాత్రమేననీ పెరెథామస్ దృఢవిశ్వాసం.

పెరెథామస్ తరఫున పోలిష్ వంశీయుడైన ఒక యువకుడు చర్చిలో ప్రార్థన జరిపాడు. ఇతడు నిజానికి చాలా భక్తితత్పరుడు. ఒక రాయబార కార్యాలయంలో ఇతడు కారుడ్రైవరుగా పని చేస్తున్నాడు. ఎల్లప్పుడు అందుబాటులో వుండడానికి పెరెథామస్‌కు వీలుండకపోవడంవల్ల, ఆయన ఈ యువకుని సహాయం అర్థించాడు. అందుకుగాను దరిమిలా పోలిష్ మతగురువు ఈ యువకుని తీవ్రంగా దండించి, మత వ్యవహారాలను చూచే సోవియట్ ఉద్యోగులకు ఈతడి విషయమై ఫిర్యాదు చేశాడు. విదేశస్థుడైన మతగురువు తరఫున ఎందుకు ప్రార్థన జరిపావని ఈతడిని వారు పశ్నించారు. ఫ్రెంచి రాయబార కార్యాలయంలో పనిచేస్తూన్న ఒక గుమాస్తాయొక్క తల్లికోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడిన

ప్రార్థన గనుకను, ప్రార్థన జరుపవలసిందని మతగురువు తనను కోరడంవల్లను తాను ప్రార్థన జరిపానని అతడు సమాధానం చెప్పాడు. ఫ్రెంచి రాయబార కార్యాలయంలో గుమాస్తాగా పనిచేస్తున్న ఒకాయన తల్లి పారిస్ నగరంలో మరణించింది. ఆమెకొరకై ప్రార్థనలు జరపవలసిందని ఆ గుమాస్తా కోరాడు.

"అంతా అబద్ధం. పెరెథామస్ అన్న మాటలన్నిటినీ నువ్వు జాగ్రత్తగా వినివుంటే, అతడు "వియత్ నామ్" అని వుండటం నువ్వు గ్రహించగలిగేవాడివి. ఆ జాతికోసం జరిగిన ప్రార్థనలివి. సోవియట్ ప్రజలకు శత్రువులైన వారితో నువ్వు సహకరించేటట్లు వాళ్ళు మాయోపాయాలు పన్నారు; అందుకు తగ్గట్టుగానే నువ్వు వాళ్ళ వలలో పడ్డావు" అని నింద ఆరోపించాడు ఆ పోలిష్ మతగురువు!

సెప్టెంబరు 2, 1950

"సీక్రెట్ మిషన్" (కుట్ర) అనే ఒకకొత్త సినిమాను గురించిన పోస్టర్లు మాస్కో నగరం అంతటా అంటించబడినాయి. జర్మనీతో ప్రత్యేకమైన ఒడంబడిక చేసుకుని, ఆ దేశాన్ని సోవియట్ యూనియన్ పైకి యుద్ధానికి సమాయత్తపరచాలని బ్రిటన్, అమెరికాలు ప్రయత్నిస్తున్నాయని చూపించడం ఈ చిత్రంలోని కథావస్తువు. ఈ చిత్రానికి స్టాలిన్ బహుమానం కూడా వచ్చింది. మాస్కో నగరంలోని పాతిక థియేటర్లలో ప్రస్తుతం ఈ చిత్రం ఆడుతున్నది. తాము జరిపివుండవలసిన యుద్ధాలన్నిటికీ సోవియట్ సైన్యాలపైన ఇంతకు పూర్వం ఆధారపడి, "ఈనాడు వీరులుగా చెలామణీ అవుతున్న" ఐసెన్ హోవర్, బ్రాడ్లీలిద్దరూ తమ రష్యన్ మిత్రులకు

వ్యతిరేకంగా కుట్రలు పన్నుతున్నట్లు ఇందులో చిత్రించారు. అంతేగాక, యుద్ధోన్మాదపూరితమైన తన జాతిపట్ల భక్తి విశ్వాసాలను సకాలంలో విడనాడి, ఉత్తేజపూరితమైన సోవియట్ రష్యాలో క్రొత్తగా నివాసమేర్పరచుకొనగోరిన ఒక అమెరికన్ యువకుడుకూడా ఉన్నాడీచిత్రంలో! ఈ సంవత్సరం తయారయిన చలనచిత్రాలలోకల్లా అత్యుత్తమమైనదిది అని రష్యావారి భావం!

సెప్టెంబరు 6, 1950

ఇవ్వాళ ఒంటిగంటకు విషిన్స్కీని నా భర్త కలుసుకుంటారు. విమాన సంఘటన విషయమై మాట్లాడడానికి అయివుంటుందని నేననుకుంటున్నాను. ఈ సంఘటన నిజంగా జరిగినట్లు భద్రతాసంఘ సమావేశంలో నిన్ననే ఆస్టిన్ ప్రకటించేవరకు ఈ విషయమై ఎటువంటి సంభాషణలను జరపడానికి నా భర్త నిరాకరించారు. కొరియా సముద్రతీరంలో మా బలాలను ప్రతిఘటించిన ఒక సోవియట్ బాంబర్ విమానాన్ని మేము నేలకూల్చినమాట వాస్తవంలాగానే వుంది.

ఈ విమానాన్ని నేలకూల్చినట్లు నిదర్శనాలేమీ కనుపించడానికి వీలులేకుండా వుండడానికిగాను, దీనిని సముద్రతీరంలో పడగొట్టినట్లు మేము కేవలం కపటనాటకమాడుతున్నామని రష్యన్ ప్రతినిధి మాలిక్ ఆరోపించాడు. కాని, నిజానికి, ఆ విషయానికి సంబంధించిన ఆధారాలు దొరికాయి. పూర్వం, బాల్టిక్ తీరంలో ఇలాగే నేలకూలిన విమానం విషయంలోకంటె ఇప్పుడు మేము సౌమ్యంగా

వ్యవహరించామనే చెప్పాలి. రష్యనులు వారికిగల విద్వేష భావాలననుసరించి ఎప్పటికప్పుడు వ్యవహరిస్తూ వుంటారేమో ననుకుంటాను.

ఇండియా రాయబారి ఇవ్వాళ మధ్యాహ్నం ఇక్కడికి భోజనానికి వస్తున్నాడు. ఇది నిజంగా మా అదృష్టం. ఆయన కేవలం శాకాహారి. అందువల్ల ఆయనకోసం ఇప్పుడే ప్రత్యేకమైన భోజన పదార్థాలు వండిస్తున్నాను. ఆయన త్వరలో రష్యానుంచి వెళ్ళిపోతూ వుండడంవల్ల, భోజనానికి రావలసిందని ఆయనను మేము ఆహ్వానించాము. తన వేదాంతం ఎంతవరకు వీలుకల్పించగలదో అంతవరకు ఈ గడ్డువాతావరణాన్ని ఈపాటికి ఆయన చవిచూచి వుంటాడు!

ఈ విమానం వ్యవహారాన్ని సోవియట్ పెద్దలు ఎలా పరిణమింపచేయనున్నారో చూడవలసి వుంది. ఈ విషయమై వాళ్ళ పత్రికలనిండా చెడరాసుకుంటారన్నది సువిదితమే. కొరియాలో మన సైనికులు జరుపుతున్న దురంతాలంటూ ఆరోపించబడిన, అత్యంత విద్వేషపూరితమైన వ్యాసాలు పత్రికలలో వెలువడుతున్నాయి. ఈ వ్యాసాల శైలి ఎంతో దురుసుతనంతో కూడినదిగా వుంటున్నది. తమ ప్రజలను యుద్ధోన్మాదులుగా తయారుచేయడానికై వారు ఇటువంటి వ్యాసాలను ప్రకటిస్తున్నారేమోనని చదివినవారికి ఆశ్చర్యం వేస్తూంది.

మధ్యాహ్నభోజనం ఒంటిగంటన్నరకు అవవలసివుంది. ఒంటిగంటంబావుకల్లా ఇండియా రాయబారి వచ్చాడు. నా భర్త రావడం ఆలస్యం కావచ్చుననిపించింది. కాని,

ఆస్ట్రేలియా రాయబారి, ఫ్రెంచి రాయబార కార్యాలయ సలహాదారుడు, డిక్ సర్వీస్, బాబ్స్ ఫ్రస్టన్ మొదలైన ఇతరులుమాత్రం వచ్చారు. రెండుగంటల వేళకు మధ్యాహ్న భోజనం చేశాము.

నా భర్త, ఇప్పటి మా తాత్కాలిక సలహాదారు రే ఫ్రస్టన్‌లు ఇద్దరూ పదిహేను నిమిషాల అనంతరం వచ్చారు. సోవియట్ మంత్రి విషిన్‌స్కీతో నా భర్త నలభై ఐదునిమిషాల సేపు గడిపారు. ఇందులో నలభై నిమిషాలసేపు, సోవియట్ నిరసన సందేశాన్ని ఎలాగైనా నా భర్తకు అందజేయడానికి విషిన్‌స్కీ ప్రయత్నించడంతోనే గడిచిపోయింది! ఆ లేఖను స్వీకరించజాలనని నాభర్త సవినయంగా చెప్పారు. విషిన్ స్కీ ఎంత బ్రతిమాలినా ఆయన దానిని పుచ్చుకోలేదు.

రాయబార పద్ధతులన్నిటికీ ఈ చర్య విరుద్ధమైనదని విషిన్‌స్కీ వాదించాడు. కాని, నా భర్త మాత్రం, ఈ విషయం ఐక్యరాజ్యసమితికి సంబంధించినదనీ, రష్యా, అమెరికా ప్రభుత్వాలు రెండిటిమధ్య చర్చించడానికి వీలుకానిదనీ బదులు చెప్పారు. సోవియట్ ప్రభుత్వానికి న్యూయార్కులోని భద్రతా సంఘంలో ప్రతినిధి వున్నాడు. ఈ విషయాన్ని గురించి ఏమైనా చర్చించదలుచుకుంటే, నిజానికి అందుకు తగినచోటు అది మాత్రమే.

రాత్రి నా భర్త ఆదమరిచి నిద్రపోయారు. అమెరికా విదేశాంగ కార్యాలయాన్నుంచి ఇదంతా జరిగిన తరువాత ఒక వార్త వచ్చింది. అందులో ఇలా వుంది: "మీ చర్యను మేము శ్లాఘిస్తున్నాం. వాషింగ్టన్‌లోని అమెరికా విదేశాంగ

కార్యాలయానికి ఒక లేఖ అందజేయబడిందనీ, కాని అది వెంటనే సోవియట్ రాయబార కార్యాలయానికి తిప్పి పంపి వేయబడిందనీ, మీ ఉపయోగార్థం ఈ సమాచారాన్ని తెలియ జేస్తున్నాం."

ఇందుకు ఇక్కడున్న ప్రతి వారు సంతృప్తి చెందారు; మాలో కొందరం చాలా గర్వపడ్డాము కూడాను.

నవంబరు 16, 1950

మాస్కోలో మనను ఎవరైనా పరామర్శిం చినా, మన వైపు స్నేహ పూర్వకంగా ఎవరైనా చూచినా అటువంటి వారిని కూడా మనం నమ్మ డానికి వీలు లేదు. ఇది అన్నిటి కంటె విచారకర మైన విషయం. ఇలా మనం ప్రవర్తించడం ఎదుటివారి క్షేమానికి ఎంత అవసరమో, మన క్షేమానికి కూడా అంత అవసరమే. అసలు ఇలా మన్ని పరామర్శించేవాళ్ళు, స్నేహ పూర్వకంగా చూచేవాళ్ళు చాలా అరుదుగా వుంటారను కోండి. కాని, మాస్కోకు వెలుపల చిన్న చిన్న నగరాలలోను, పట్టణాలలోను మాత్రం మన వాళ్లను కొంతమంది పరా మర్శిస్తూ వుంటారు. కాని, వీరందరూ హృదయపూర్వకం గానే ఇలా చేస్తున్నారని మనం ఎన్నడూ కచ్చితంగా నమ్మ డానికి వీలులేదు; మనం ఏమిమాట్లాడుతున్నా, ఏమిచేస్తున్నా ఎల్లప్పుడూ చాలా అప్రమత్తులమై వుండాలి.

మే మెరుగున్న ఒక బ్రిటిష్ యువకుడు, ఆయన భార్య ఒక రష్యన్ యువకునితోను, ఆయన భార్యతోను స్నేహం చేసుకున్నారు.

బస్సులో వెడుతూవుండగా ఈ ఇంగ్లీషు యువతి మనీ పర్సు పోగొట్టుకున్నది. అది ఆ రష్యనులకు దొరికింది. వారు ఈమెకు టెలిఫోనుచేసి, దానిని ఇవ్వడంకోసం ఫలానప్పుడు వస్తామని ఏర్పాటు చేసుకున్నారు. ఈ విధంగా ఈ రెండు కుటుంబాలవారికీ పరిచయం ఏర్పడింది.

దరిమిలా వీళ్ళు చాలాసార్లు కలుసుకున్నారు. బ్రిటిషు దంపతులు మాత్రం ఎప్పుడు టెలిఫోనుచేసినా పబ్లిక్ టెలిఫోన్‌నే ఉపయోగించేవారు. బ్రిటిష్ రాయబార కార్యాలయం నుంచి వారికి టెలిఫోను చేయకుండా జాగ్రత్త వహించారుకూడా.

రష్యన్ దంపతులు వీరిని ఒక రాత్రి విందుకు పిలిచారు. వీరు కలుసుకున్నప్పుడెప్పుడూ రాజకీయ విషయాలను గురించి చర్చించేవారేకాదు. వీరు నలుగురికీ సంగీతమన్నా, బేలెట్ నృత్యమన్నా మంచి అభిరుచి వుంది. అందువల్ల వీరి సంభాషణ ఎప్పుడూ రసానుభూతిని గురించే చాలా ప్రమాదరహితంగా జరిగిపోతూవుండేది.

ఇలా వెళ్ళివస్తూవుండగా ఒకనాటిరాత్రి తమను ఎవరో వెంటాడుతున్నట్లు ఈ బ్రిటిష్ దంపతులు అనుమానించారు. అంతకుమించి మరేమీ జరగలేదు. తరువాతసారి వీరు టెలిఫోను చేస్తే, అవతలనుంచి వీరికేమీ సమాధానం రాలేదు. మళ్ళీ టెలిఫోనుచేశారు. కాని మళ్ళీ సమాధానమేమీ లేదు. అంతే ఆఖరు!

మనతో స్నేహంగా వుండడం ఎవరికైనా ఎంత ప్రమాదకరంగా పరిణమించవచ్చునో ఇటువంటి ఉదంతాలు

మనకు వివరిస్తాయి. ఎదుటివారినికూడా అటువంటి ప్రమాదానికి లోనుగానివ్వడానికి మనం సాహసించలేము. ఒకవేళ ఇచ్ఛికంగా వారే అటువంటి పనికి పూనుకుంటే వారినిచూచి మనం ఆశ్చర్యపోతాము; వారి ఉద్దేశాలను శంకిస్తాము.

సాటి రాయబారకార్యాలయోద్యోగి హెన్రీ గత మాసం లైప్జిగ్ నగరంలో జరిగిన ఉదంతం మాకు చెప్పాడు. ఆయనకు రైలులో ఒక రష్యన్ కలిశాడు. దరిమిలా ఆ రష్యన్‌తోను, అతడి భార్యతోను ఆయన మాట్లాడాడు. మాస్కో సంగీతపాఠశాలలో సంగీతచరిత్ర ప్రొఫెసర్‌గా ఆ రష్యన్ పనిచేస్తున్నాడనికూడా హెన్రీ తెలుసుకున్నాడు.

ఇద్దరూ విద్వాంసులు కావటంవల్ల, ఇద్దరికీ అనేక విషయాలలో ఒకేవిధమైన అభిరుచివున్నట్లు గ్రహించారు. ఆ వారమంతా వారు లైప్జిగ్ నగరంలో కలిసిమెలిసి తిరిగారు. హెన్రీని ఆ రష్యన్ తనమిత్రులకు పరిచయం చేశాడు. ఈ స్నేహితుల యిళ్ళలోకూడా హెన్రీ రాత్రింబగళ్ళు విందులు ఆరగించాడు. కొత్త కొత్త ప్రదేశాలు చూచిరావడానికి వెళ్లాడు. స్థానిక పురావస్తు ప్రదర్శనశాఖోద్యోగి అతడికి మార్గదర్శకుడుగా పనిచేశాడు. ఇదంతా బహిరంగంగానే జరిగింది. దీనినంతను అరికట్టాలని ప్రభుత్వాధికారులు భావించివుంటే, నిజానికి ఆ సంగీతం ప్రొఫెసరుకు ఒక్క మాట మాత్రం చెప్పివుంటే సరిపోయేది.

కాని, ఆ సంగీతం ప్రొఫెసర్ కాని, ఆయన మిత్రులు కాని రాజకీయ వ్యవహారాలను గురించి ఎటువంటి ప్రసక్తి తెచ్చేవారు కారని హెన్రీ చెప్పాడు. వీరిలో చాలా మంది

ఇంగ్లీషుభాషకాని, ఫ్రెంచిభాషకాని మాట్లాడేవారు. వీరంతా సభ్యత తెలిసిన మనుష్యులు, వైజ్ఞానిక రంగాలలో కృషి చేస్తున్నవారు. హెన్రీని తమ సాటి విద్వాంసులలో ఒకడుగా వీరు పరిగణించారు. హెన్రీకికూడా వీరి స్నేహం బాగానే వుంది. ఆయన తిరిగివచ్చిన తరువాత కూడా ఆయన్ని చాలా సార్లు టెలిఫోనులో పిలిచి సంభాషించాడు; తన యింట్లో భోజనం చేయవలసిందని కూడా ఆహ్వానించాడు.

ఐతే, వారియిల్లు ఎలావున్నదని హెన్రీని ప్రశ్నించాను. ప్రొఫెసరు నెలకు 5000 రూబుల్సు జీతం తెచ్చుకుంటున్నాడు. ఆయన, ఆయన భార్య రెండు గదులలో నివసిస్తున్నారు. ఈ గదులు చాలా సాదాగా అలంకరించబడి వున్నాయి. అయితే, పుస్తకాల అరలు మాత్రం చాలా వున్నాయి. వారికి ప్రత్యేకంగా ఒక చిన్న వంట గది, ఒక స్నానాల గది కూడా వున్నాయి. ఇదంతా ఒక కుటుంబంవారు చాలా విలాసవంతంగా వుండతగ్గ భాగంగా వర్గీకరించబడింది! వారికి ప్రత్యేకంగా పనిమనిషి లేదు. కాని, ఒక స్త్రీమాత్రం రోజూవచ్చి ఇల్లుతుడిచి, బట్టలు ఉతికిపోతూ వుంటుంది. వారికి స్వంతంగా కారు లేదు. తాను ఒకటి కొనుక్కుందామనుకున్నాననీ, కాని సంగీత విద్యాలయం వారు తనకు ఎప్పుడు కావలసినా కారును పంపుతూ వుండడం వల్ల స్వంతంగా కారును కొనడం మానివేశాననీ ప్రొఫెసర్ చెప్పాడు. ఆయన తన సెలవు దినాలను కాకసస్ ప్రాంతంలో గడపడానికి కావలసిన ఏర్పాట్లన్నిటినీ సంగీతవిద్యాలయం వారే చేశారు. ఆయన గ్రంథాలను కొన్నిటిని సంగీత

విద్యాలయం వారు ప్రచురించారు. వాటిని అమ్మగా వచ్చిన డబ్బులో కొంతభాగం కూడా ఆయనకు ముడుతూ వుంటుంది. ఆయన సంగీత స్వరకల్పనచేస్తూ వుంటాడు. కాని ఇటీవల కొంతకాలంగా ఆయన ఇటువంటి స్వరకల్పన ఏమీ చేయడం లేదు.

ఆయన రచించిన స్వరాల వ్రాతప్రతులను తనకు చూపించాడనీ, వాటిలో నేటి కాలపు పోకడలు బాగా ఎక్కువగా వున్నాయనీ హెన్రీ చెప్పాడు. ఇటువంటి సంగీత మంతా కమ్యూనిస్టు ఆదర్శాలకు హానికరమైనదని కమ్యూనిస్టులు తమ తిరస్కారముద్రను వేశారు. నిజానికి ఆ సంగీతం ప్రొఫెసరు ఇటీవల స్వరకల్పన చేయకపోవడానికి ఇదే కారణమై వుంటుంది.

కాకపోతే, రష్యన్ ప్రొఫెసరుమాత్రం ఇలాగని చెప్పలేదు. జెకొస్లవాకియా సంగీతచరిత్ర, పోలెండు సంగీతచరిత్ర—అని తాను వ్రాస్తున్న రెండు గ్రంథాలను సమాప్తిచేయడంలో నిమగ్నమైవున్నాననీ, తన కాలమంతా అందుకే సరిపోతున్నదనీ ఆయన చెప్పాడు.

ఈ మాటలకు హెన్రీ ఆశ్చర్యపోయాడు. నిజానికి మేము కూడా అలాగే ఆశ్చర్యపోయాము. ఆ రష్యన్ ప్రొఫెసర్ ఈ మాటలను మనస్ఫూర్తిగానే చెప్పుతున్నాడా? ఒక విదేశస్థునితో స్నేహం చేసుకొనడానికి అధికారులు ఆయనకు అనుమతి నెందుకిచ్చారు? వారి అనుమతితోనే ఆయన ఇలా స్నేహంచేస్తూ వుంటే, వైజ్ఞానికంగాను, రాజకీయంగాను తమకుగల అభిప్రాయాలను హెన్రీ తల

కెక్కించడానికి ఆ ప్రొఫెసరు ప్రయత్నించడేమి? ఆ. ప్రొఫెసరును హెన్రీ తనతో స్నేహంగా వుండనివ్వడం మంచి పనేనా? ఇలా స్నేహం నెరపడంలోగల ప్రమాదాన్ని ఆ ప్రొఫెసర్ గుర్తించాడా?

ఈ ప్రశ్న లన్నిటి గురించి మేము ఆలోచించి నప్పుడల్లా, ఈ స్నేహ కలాపమంతా ఆయన అధికారులకు తెలుసుననీ, ఇదంతా వారి అనుమతితోనే జరుగుతున్న పని అనీ నిర్ణయానికివస్తూ వుంటాము. ఇటువంటి ఉదంతాలు చాలా అరుదుగా జరుగుతూ వుంటాయి. వీటి అంతరార్థాన్ని మనం శంకించక తప్పదు కూడాను. నిజానికి, హెన్రీ అత్యంత స్థిర సంకల్పుడు; తన దేశం యెడల అనుపమభక్తి విశ్వాసాలుగలవాడు. అందువల్ల, అతడి మనసును మార్చ గలమని వారు అట్టే ఆశించి వుండకపోవచ్చు. ఏమైనా, ఇది మాత్రం సందిగ్ధసమస్య.

ఈ దేశ ప్రజలను గురించి మేము తెలుసుకొనడానికి వీలులేకుండా నిషేధాజ్ఞలను అమలుజరుపుతూ, ఇక్కడ మాస్కోలోనే మాకూ వారికీ ఏవిధమైన సంబంధాలు లేకుండా అవరోధాలు కల్పించి, మమ్మల్ని వైరివర్గం క్రింద జమకట్టే ఈ ప్రభుత్వవ్యవస్థ నిజానికి ఎంతబుద్ధిహీనమైనది! చివరికి గేటుదగ్గర కాపలా వారికి కూడా తాము ఎప్పుడు నమస్కరించాలో, ఎప్పుడు నమస్కరించ నవసరంలేదో చెప్పబడుతున్నదనీ, మాకు థియేటరు టిక్కెట్లు నెలకొక వారంలో తప్ప మిగతా సమయాల్లో ఇవ్వరనీ, పని వాళ్ళు పనిలోకి రావడం రాకపోవడం పత్రికలలో వెలువడే ప్రముఖ

ఫ్వా ర్తలపైన, వారికి పై నుంచివచ్చే తాఖీదులపైన ఆధార పడివుంటుందనీ, ఇక్కడ పెత్తనదారీ విధానం అంత కూలంకషంగా అమలుజరుగుతున్నదనీ చెప్పితే, ఇంటిపట్టున వున్న మా వాళ్ళు అవగాహన చేసుకోనడం నిజానికి కష్టంగానే వుండి వుండాలి. కాని, "వారికి" (రష్యా పభుత్వపు పెద్దలకు) మాత్రం ఇటువంటి ఆలోచనలన్నీ తేలికగానే తట్టుతూ వుంటాయి; చిన్నచిన్న వివరాలు వేటివిషయంలోనూ కూడా వారు జాగ్రత్తవహించకుండా వదలరు. ఒకసారి దేనికైనా వారు అనుమతి నివ్వవచ్చు. కాని, మరునాడే ఆ అనుమతిని వారు ఉపసంహరించవచ్చు. ఇక్కడ ఎప్పుడేమి జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు!

ఫిబ్రవరి 19, 1951

ఫ్రాన్సులో ఇటీవలనే మంచిపుస్తకం ఒకటి ప్రచురించ బడింది. దీనిపేరు 'సైబీరియా'; దీని రచయిత పేరు సిలిగా. ఈయన సెర్బ్ జాతీయుడు. సైబీరియాలోని వెట్టిచాకిరీ కేంద్రాలలో ఏడు సంవత్సరాలపాటు శిక్ష ననుభవించి వచ్చాడు. వెట్టిచాకిరీ కార్మికులను చేర్చుకునే విధానాన్ని గురించి ఆయన తెలియజేసిన విషయాలవల్ల చాలా రహస్యాలు బయటపడ్డాయి. ఏదైనా కొత్తనిర్మాణం ఒకటి ప్రారంభ మయిందంటే, దేశంలోని జైళ్ళన్నీ ఖాళీ అయినాయన్న మాటేనని ఆయన వ్రాశాడు. విచారణకు ఎదురుచూస్తున్న ఖైదీలను ఆదరాబాదరా జడ్జీల ఎదుట హాజరుపరుస్తారనీ, ప్రభుత్వంయొక్క తక్షణావసరాలనుబట్టి వీరికి విధించబడే శిక్ష వుంటూవుంటుందనీ ఆయన వ్రాశాడు.

మా వంటమనిషి కొడుకు సైబీరియాలో ఉత్తరాదిని మారుమూలప్రాంతంలో నాలుగు సంవత్సరాల వెట్టిచాకిరీ శిక్ష ననుభవిస్తున్నాడు.

ఫిబ్రవరి 26, 1951

శనివారం రాత్రి, 'ఇస్పేటురాణి' అనే ఒపేరా నృత్యాన్ని చూడడానికి వెళ్లాము. పుష్కిన్ కవి రచించిన పద్యాల నాధారంగా తీసుకుని ఈ ఒపేరా నృత్యం సృష్టించబడింది. ఇందలి కథావస్తువు పాతకాలపు సెయింట్ పీటర్స్‌బర్గ్ నగరానికి సంబంధించినది. కాని, ఇందులో ప్రదర్శించబడిన పార్కుదృశ్యాలు, నెవాప్రాంతదృశ్యాలు మాత్రం అత్యద్భుతంగా వున్నాయి.

ఇటీవలి బేలెట్ నృత్యాలలోను, ఒపేరా నృత్యాలలోను దృశ్యాలంకరణ అతి విస్తృతంగా వుంటున్నది. కాని ఈ అలంకరణ అంతా చౌకపారుగా కూడా వుంటున్నది. ఇప్పుడు బోల్షాయ్ థియేటరులో ఒక ఒపేరానృత్య ప్రదర్శనం జరుగుతున్నది. యూక్రేనియన్ ఒపేరా సంప్రదాయాల ననుసరించి ఈ ఒపేరా నృత్య నిర్మాణం జరిగినట్లు ప్రేక్షకులను మభ్యపెట్టడానికి ఇందులో ప్రయత్నం జరిగింది. కాని, నిజానికి నేటి రష్యాసమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని (కోల్ఖోజ్) జీవన విధానానికి సంబంధించిన పచ్చిప్రచారక ఒపేరా నృత్య మిది. ఇందలి సంగీతం భయంకరంగా వుంది; ఈ ఒపేరా నృత్యంలోని గేయ సాహిత్యంకూడా ఏమీ బాగా లేదు.

ఈ ఒపేరా నృత్యంలోని ముఖ్యమైన ఘట్టాలన్నిటికీ ఒక గోధుమచేను రంగస్థలం. తెర లేచేసరికి కథానాయకి గడ్డివాముపైన పడుకుని వుంది. ఇది చూచేసరికి, "అమ్మయ్యా! ఈనాటికైనా ఒక ప్రేమదృశ్యాన్ని చూపిస్తున్నారు!" అనిపించింది ప్రతివారికీ. కాని, కథానాయకుడు ముందుకువచ్చి, ఆమెవైపు ఒకసారి చూచి, జేబులోనుంచి ఒక కాగితాన్ని తీసి ఇక పాట లంకించుకున్నాడు—ఐతే, ఇది ప్రేమగీత మేమీ కాదు; కొత్తగా నిర్మించవలసిన ఆనకట్టను గురించి, విద్యుదుత్పత్తి కేంద్రాన్ని గురించి, ఆనకట్ట నిర్మాణంలో ఏర్పాటు చేయవలసిన లాకు తలుపులను గురించిన వివరాలు; అక్కడినుంచి పొంగిపొరలే నీటిని గురించి, సోవియట్ ప్రజలకుగల బ్రహ్మాండమైన నిర్మాణ శక్తినిగురించి వ్రాయబడిన స్తోత్రపాఠాలు—ఇదీ గేయం!

ఈ ఒపేరా నృత్యాన్ని చూస్తూ థియేటరులో ఉన్న జనంలోగాని, బయట వరండాలో నిలబడివున్న జనంలోగాని, అక్కడి కాఫీ హోటల్లో కూర్చున్న జనంలోగాని ఏ విధమైన ఉత్సాహమూ లేదు—కనీసం, నోట మాటకూడా లేదు. అప్పుడు వారు నిజంగా ఏమి ఆలోచిస్తున్నారో ననిపిస్తుంది. ఇటువంటి వక్ర రీతులకు దారితీస్తున్న తమ పరిపాలకుల దగ్గరనుంచి అసలు వారు ఏమి ఆశిస్తూ వుండివుంటారో నని ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది కూడా.

ఏప్రిల్ 6, 1951

రష్యావారీమధ్య చాలా ఆడంబర పూర్వకంగా ప్రకటించిన ధరల తగ్గుదల నాటినుంచీ షాపుల్లో జనం రద్దీ

చాలా ఎక్కువగా వుంది. ప్రజలకు అవసరమైన దానికంటె తక్కువగా వస్తువులు లభిస్తూవుండడంవల్ల, ప్రతిదానికీ— చివరకు ఊరగాయలకు కూడా—జనం బారులుతీరి వేచి వుండడమే జరుగుతున్నది. ఇక్కడున్న మోస్టార్గ్ అనే పెద్ద కిరానాకొట్టు లోపలకువెళ్ళి బయటికిరావడం ఒక బ్రహ్మ ప్రళయం.

ఇది, మాస్కోనగరం చుట్టుపక్కల నివసించే ప్రజలు వచ్చి కనపడ్డ వస్తువల్లా కొనుక్కుని పోయేకాలంలాగా వుంది.

ఇప్పుడు నేలమీది మంచు అంతా కరిగి పోవడంవల్ల, మా తోట విషయమై ఆలోచిస్తున్నాను. పాపం మా ముసలి తోటమాలి సమాచారమేమీ మాకు తెలియనే లేదు. అతడు కనపడకుండాపోయి ఇప్పటికి రెండు వారా లయింది. ఒక హోటల్లో తప్పతాగి, ఒకణ్ణి గాయపర్చినందుకు అరెస్టు చేయబడ్డాడని అంటున్నారు. అతడిని మొట్టమొదట తీసుకొని వెళ్ళిన జైలుకు అతడి భార్య పోయివచ్చింది. తరువాత అక్కడినుంచి అతడిని మరొక జైలుకు మార్చివేశారు. అక్కడకు కూడా ఆమె వెళ్ళింది. కాని, అత డెక్కడ వున్నాడో వివరా లేమీ తెలియలేదు. ఇప్పు డామె ఒక న్యాయవాదిని కూడా ఏర్పాటుచేసుకున్నది. కాని ఆయన కూడా ఆమె భర్తనుగురించిన సమాచారాన్ని సంపాదించ లేక పోయాడు. తోటమాలి 65 సంవత్సరాలవృద్ధు; పెద్దబలం కలవాడు కూడాకాదు. తాగుడు అలవాటున్నప్పటికీ అతడిని చూస్తే నిజానికి ప్రతివారికీ జాలివేస్తుంది. అతడు తిరిగి ఎన్నటికీ తన కళ్ళపడడని అతడి భార్య విచారిస్తూంది.

ఐనప్పటికీ, ఈ విషయంలో ఆమె నిర్లిప్త వైఖరిమాత్రం నిజానికి మనకు దారుణంగా కనిపిస్తుంది.

చైనావారి విషయంలో ఇక్కడొక పెద్ద నాటకం నడుస్తున్నది. త్రెట్యాకోవ్ చిత్రకళా ప్రదర్శనశాలను చూడడానికి మేము వెళ్ళినప్పుడు అక్కడి గదులన్నిటిలోను స్టాలిన్‌వైపు స్నేహపూర్వకంగా చూస్తూన్న కమ్యూనిష్టు చైనా అధ్యక్షుడు మావో సే-టుంగ్ చిత్రాలు, మావో సే-టుంగ్‌వైపు స్నేహపూర్వకంగా చూస్తున్న ఇండో-చైనా కమ్యూనిష్టునాయకుడు హోచిమిన్‌చిత్రాలు అలంకరించి వున్నాయి. సోవియట్ — చైనా ఒడంబడికను, వివిధ జాతుల సౌభ్రాత్రాన్ని ఉగ్గడిస్తూ రచించిన బ్రహ్మాండమైన చిత్రాలు ప్రదర్శించబడి వున్నాయి. వ్యంగ్యచిత్రాల గదిలో గోడలపైన, కొరియా యుద్ధ బీభత్సాన్ని గురించిన చిత్రాలున్నాయి. మరణశిక్షలు అమలుజరుగుతూవుంటే మెకార్థరు గమనిస్తున్నట్లు; పసిపిల్లలపైన బాంబులు పడుతున్నట్లు, రక్తం వెల్లువలై పారుతుండగా అమెరికన్‌సైనికులు నిర్లక్ష్యంగా ముందుకు వెళుతున్నట్లు రచించిన చిత్రాలు ప్రదర్శించబడి వున్నాయి. యుద్ధోన్మాదులు అనే పేరుతో కొందరి చిత్రాలు ఒక వరుసలో అమర్చివున్నాయి. ఈ చిత్రాలు రచించిన ముగ్గురు చిత్రకారులకు స్టాలిన్ బహుమాన ప్రదానం కూడా జరిగింది. డీన్ అచిసన్ చిత్ర రచన వీరి అభిమాన విషయం; ఆయన చిత్రాన్ని వీలయినంత అసహ్యంగా వీరు చిత్రించారు.

ఏప్రిల్ 11, 1951

వాతావరణం చాలా మనోహరంగా వుంది. గృహిణు లందరూ తమ యిళ్ళ కిటికీలు, తలుపులు శుభ్రంగా కడుగు తున్నారు. ఈ పని శ్పాసో భవనంలో మరింత త్వరితగతిని జరుగుతున్నది. ఇంటి పనికత్తెలు ముగ్గురూ తువ్వాళ్లు తలలకు చుట్టుకుని అద్దాల తలుపుల నన్నిటినీ సబ్బునీళ్ళతో కడుగుతూ ఎడ తెరిపిలేకుండా పనిచేస్తున్నారు.

మొఖోవాయా భవనంలోని పనివాళ్ళలో చాలా మంది తమ బట్టలను చాలావరకు నీళ్ళగదులలోనే విస్త్రీ చేసి వేస్తారు. కాని, ఇలా ఇంటివద్ద విస్త్రీ చేయడానికి వీలుకాని దుప్పట్లు, మరికొన్ని ప్రత్యేకమైన వస్త్రాలు ఇంకా వుంటూనే వుంటాయి.

బోల్షాయ్ థియేటరులో పనిచేస్తున్నవారికి బట్టలు ఉతకటానికి ప్రత్యేకంగా ఉన్న చాకలిషాపు తప్పితే మాస్కోలో బట్టలు ఉతికే షాపులంటూ లేదనే చెప్పవచ్చు. మాబట్టలు ఏవైనా ఉతకవలసినవి వుంటే వాటిని ఫిన్లాండుకు గాని, స్వీడెన్‌కుగాని పంపుతాము. బట్టలు ఉతికే షాపులు ఇక్కడ చాలా సకృతు; అటువంటప్పుడు సోవియట్ పౌరు లలో చాలామంది రంగుచొక్కాలు తొడగడంలో ఆశ్చర్యం లేదు. ఐనా, వీరు మనం అనుకునేటంత అపరిశుభ్రంగా వుండని మాట కూడా వాస్తవమే. ఇక్కడ ప్రతివారూ వారానికి ఒక సారి ఆవిరి స్నానం చేయడం సంప్రదాయంగా వుంది. ఈ సంప్రదాయాన్ని అన్నివర్గాలవారు పాటించడం వీరి పరిశుభ్ర తకు చాలావరకు కారణం. గ్రామాలలో స్నాన గృహాలు

ఏర్పాటుచేయబడివున్నాయి. క్లబ్బులలో సమావేశమైనట్లు, ముఖ్యంగా మొగవాళ్ళు అక్కడ సమావేశమౌతూవుంటారు.

మే డే ఉత్సవాలకై యథావిధిగా పెద్దఎత్తున సన్నాహాలు జరుగుతున్నాయి. ఫాక్టరీలు రాత్రింబగళ్లు విధీ విరామం లేకుండా పనిచేస్తున్నాయి. వీటి మోతతో మాస్కో నగరం రాత్రిపూట మరీ దద్దరిల్లి పోతున్నది. రక్తం గడ్డ కట్టుకుపోయేటట్లు ఇటువంటి భయంకరమైన శబ్దం నగరం నలుమూలల నుంచీ వినిపిస్తున్నది. ఉత్పత్తి ప్రమాణాలను పెంచడానికి, కావలసివున్న ఉత్పత్తిని సరిపుచ్చడానికి ఇక్కడ ఎటువంటి చర్యలు తీసుకోడానికైనా వెనుకాడరు.

కొరియాలో అమెరికన్ సర్వసేనాని పదవి నుంచి జనరల్ మెకార్థరును ప్రెసిడెంట్ ట్రూమన్ తొలగించాడని ఇవ్వాళ ఉదయం రేడియోలో విన్నాము. ఉదయం పది గంటలకు వెలువడే బి.బి.సి. రేడియో వార్తలలో ఈ విషయం ప్రసారం చేయబడింది. ఈవార్తపట్ల సోవియట్ యూనియన్ వైఖరి ఎలావుంటుందో ఇప్పుడు మనం తెలుసుకోవలసివుంది. వీరి అభిప్రాయం వెంటనే వెలువడదు. ముఖ్యమైన సంఘటనలన్నిటిమీద తమ విమర్శలను వెలువరించడానికి వీరు ఎల్లప్పుడూ జాగుచేస్తూనే వుంటారు; వీటిపైన తర్జనభర్జనలు జరిపి, వీటిని తమ ప్రచారసాధనంగా ఉపయోగించుకోనడానికి వీలయేవరకు వీ రిలా జాగుచేస్తూనే వుంటారు.

ఏప్రిల్, 14, 1951

మాస్కో నగరమంతా చైనీయులతో నిండివుంది. వ్యాపార ప్రతినిధివర్గాలవారు, విద్యార్థులు, ప్రభుత్వ వర్గాల

వారు మొదలైన వారందరూ ఇందులో వున్నారు. ట్రెట్యా కోవ్ చిత్రకళా ప్రదర్శనశాలలో గత వారం నేను చూచి నప్పటికంటె, ఈ శనివారంనాడు ఇంకా చాలా చిత్రాలు కనుపించాయి. ట్రాట్‌స్కీ, టిటో మొదలైనవారు సోవియట్ యూనియన్ మెప్పును కోల్పోయినప్పుడల్లా ప్రభుత్వోద్యోగుల పని క్లిష్టతరమౌతూ వుంటుంది. ఇందుమూలంగా అనేక రికార్డులలో మార్పులు చేయవలసి వస్తున్నది; అనేక చిత్ర పటాలను మూలపార వేయవలసి వస్తున్నది; అనేక విగ్రహాలను బద్దలు కొట్టివేయవలసివస్తున్నది,

రష్యన్ భాషను ఎడ్ ఫ్రీర్స్ బాగా చదవగలడు. సోవియట్ యూనియన్ నుంచి తప్పించుకు పారిపోవాలని ప్రయత్నించిన వారికి ఎటువంటి శిక్షను విధించాలని వారి న్యాయ శాస్త్రంలో వుందో ఆయన నాకు తెలియజేశాడు. ఉద్యోగులుగాని, సైనికులుగాని, సాంకేతిక నిపుణులుగాని పారిపోవాలని ప్రయత్నిస్తున్నట్లు కనుపిస్తే చాలు, వారి నేమీ విచారించకుండానే, వారేమి చెప్పదల్చుకున్నారో వినకుండానే వెంటనే కాల్చి చంపివేయవచ్చు. వారి కుటుంబంలోగాని, వారి మిత్రులలోగాని వారు పారిపోవడాన్ని గురించి తెలిసిన వారు ఎవరైనా వుంటే అటువంటి వారికి పది సంవత్సరాల పాటు వెట్టిచాకిరీ శిక్ష విధించ వచ్చు — అన్నిటి కంటే భయంకరమైన విషయమే మంటే — అతడి సన్నిహిత మిత్రులకు అతడు చేసిన "నేరం" గురించి ఏమాత్రం తెలియకపోయినప్పటికీ, వారిని రాజకీయ దృష్ట్యా అవాంఛనీయులని తీర్పునిచ్చి, ఉత్తరాదిని మారుమూల ప్రాం

తాలలో ఐదు సంవత్సరాలపాటు వెట్టిచాకిరీ శిక్ష ననుభవించాలని నిర్ణయించవచ్చు. పారిపోవడానికి ప్రయత్నించిన వారిలో సైనికులకు, తదితరులకు మధ్యను పాటించబడే భేద మేమిటంటే, సైనికులుకానివారికి ఏదో ఒకవిధమైన విచారణ జరగడానికి అనుమతినిస్తారు; సైనికులకు ఆ అవకాశం కూడా వుండదు! సోవియట్ యూనియన్‌లో న్యాయ నిర్వహణ విధానం ఈ తీరుగా వుంది.

మా తోటమాలి భార్యకు తన భర్త జాడ ఇంకా తెలియనేలేదు. అతడి కేసు విచారణ ఈమాసంలో జరగవలసి వుంది. ఆమె తన భర్తనుగురించి అడగడానికై జైలుకు వెళ్ళిందన్నమాటే గాని, అందువల్ల ఆమెపొందిన సంతృప్తి మాత్రం శూన్యం. అతడింకా అక్కడ వున్నాడో లేడోకూడా ఆమెకు తెలియదు. బ్యూరోబిన్ (సోవియట్ విదేశాంగ కార్యాలయపు అనుబంధ శాఖ. విదేశ రాయబార కార్యాలయోద్యోగుల అవసరాల నన్నిటినీ ఈ శాఖ పరిశీలిస్తూ వుంటుంది) ఉద్యోగులు మా కొక "తోటమాలి"ని పంపబోతున్నారు. ఈమె చాలా బలిష్ఠురాలనీ, పూర్వం ఇళ్ళు తుడిచే మనిషిగా పనిచేసిందనీ, తోటలు పెంచడమంటే చాలా ఇష్టమనీ మాకు తెలియజేశారు.

మే 7, 1951

మా క్రైస్లిస్ ప్రయాణాన్నిగురించి సుదీర్ఘంగా వివరించడానికి కాలవ్యవధి లేదు. కాని, మేము క్షేమంగా తిరిగి వచ్చామనీ, పదిరోజులపాటు కులాసాగా గడిపామనీ మాత్రం తెలియ చెయ్యదల్చుకున్నాను.

ఉక్రేయిన్, కాకసస్ ప్రాంతాలు నిజంగా చూడతగ్గవి. అక్కడికి వెళ్ళగలిగినందుకు నేను సంతోషించాను. అందులోను, మే నెల ఒకటవ తేదీన వెళ్ళినందుకు మరీ సంతోషించాను. మేము యథేచ్ఛగా చూడదల్చుకున్న మే దినోత్సవ విశేషాలను చూడనివ్వకుండా రష్యన్ అధికారులు మమ్మల్ని చాలా ఇబ్బందులు పెట్టారు. అనేక విధాలుగా చికాకులు కలిగించారు.

ఈవేళ మా యింటి వ్యవహారాలకు సంబంధించిన సంతోషకరమైన వార్త తెలిసింది. మీ తోటమాలికి ఐదేళ్ళ శిక్ష విధించకుండా ఒక్క సంవత్సరంతోనే సరిపెట్టారు! ఇతడి భార్య అప్పుడప్పుడు జైలుకుపోయి ఇతడిని చూసి వస్తూ వుండవచ్చు. కాని, శిక్ష పూర్తికాగానే, ఇతడు మాస్కోలో వుండడానికి ఏ మాత్రం వీలులేదు. ఐతే, ఇందుకామె ఏమీ విచారించటం లేదు. ఎందువల్లనంటే, ఆమె కొడుకు సైబీరియా ప్రవాసాన్నుంచి తిరిగి రాగానే అతడిపైన కూడా సోవియట్ అధికారులు ఇటువంటి ఆంక్షనే విధించి తీరుతారు.

ఖైదునుంచి విడుదలయే వారిపైన విధించబడే ఆంక్షలు రకరకాలుగా వుంటాయి. కొందరిని ఉత్తరాదిని ఉండిపోవాలని శాసిస్తారు. మరికొందరికి ఫలానా పట్టణంలో గాని, ఫలానా జిల్లాలోగాని వుండవచ్చునని తెలియజేస్తారు. ఇంకా కొందరినిమాత్రం మాస్కోనగరానికి 125 కిలో మీటర్ల సమీపంలోకూడా నివసించేటందుకు అనుమతినిస్తారు. అసలు సోవియట్ వ్యవస్థ చాలా కపటోపాయాలతో

కూడుకున్నట్టిది. ఉదాహరణకు, మా తోటమాలిని అరెస్టు చేసి ఖైదులోపెట్టినందుకు అతడి భార్యకు ఇప్పుడు సోవియట్ అధికారులపట్ల కోపమేమీ లేదు; పై పెచ్చు, అతడికి విధించబడిన శిక్షను గురించి కోర్టువారు తనకు తెలియజేసినందుకుగాను వారిని మెచ్చుకుంటున్నది కూడాను. అసలు అతడికి ఐదేళ్ళు శిక్ష విధించినప్పటికీ, ప్రజల కష్ట సుఖాలను గుర్తించగల ఉదారబుద్ధిగల ప్రభుత్వం గనుక, ఆ శిక్షను ఒక సంవత్సరానికి తగ్గించింది అని కూడా ఆమె భావిస్తున్నది.

ఆమె తన భర్తకు భోజనం, మందులు ఇంటి దగ్గర నుంచి జైలుకు పట్టుకు వెళ్ళి యిద్దామనుకుంది. కాని, ఇందుకు అధికారులు అనుమతించ లేదు. ఆ తరువాత, శిక్షనంతను అనుభవించడానికై జైలుకుగాని, వెట్టిచాకిరీ కేంద్రానికిగాని అతడిని ఎక్కడికి పంపితే అక్కడికి మాత్రం ఆమె ఇలా ఆహారాన్ని, మందులను తీసుకువెళ్లి ఇవ్వడానికి అనుమతిస్తారు. కాని ఇప్పుడు అతడికి డబ్బు నివ్వడానికి మాత్రం వారు ఆమెకు అనుమతించారు. ఆ డబ్బుతో జైలు స్టోర్సులో ఏవైనా అదనంగా అతడు కొనుక్కోవచ్చు.

మామూలుగా ఖైదీలకు పెట్టే తిండి వారికేమీ సరిపోనట్టుగా వుంటుంది. ప్రొద్దుటిపూట పల్చటి అంబలి; మధ్యాహ్నంపూట నానురొట్టె, పులుసు; రాత్రిపూట నానురొట్టె, మంచినీళ్ళుమాత్రం యిస్తారని మా తోటమాలి భార్య చెప్పింది.

మా రాయబారకార్యాలయోద్యోగుల తనిఖీదారు స్టీవెన్స ఇటీవలనే బెల్గ్రేడ్ నగరాన్నుంచి ఇక్కడకు

వచ్చాడు. అమెరికా విదేశాంగ కార్యాలయం ఈయనను పంపింది. రష్యాలో కనుపిస్తున్నంత మంది వికలాంగులు తనకు మరెక్కడా కనుపించలేదనీ, చివరకు వెనుకబడి వున్న దేశమైన బల్గేరియాలో కూడా ఇంతమంది వికలాంగులు లేరనీ ఆయన అన్నాడు. ఆయన నిన్నను ఆర్బత్ వీధిగుండా వెడుతుండగా, ఒకడు కాళ్లు చేతులతో దేకుకుంటూ పోతున్నాడట. అతడి మొండికాళ్ళకు, మొండి చేతులకు తుక్కు కాగితాలు, చింపిరి గుడ్డలుచుట్టి వున్నాయట. ఐతే, నాలుగు సైనిక పతకాలుమాత్రం అతడి రొమ్మునుంచి కిందికి వేళ్ళాడుతూ వున్నాయట! పశ్చిమ దేశాలలోని నా మిత్రులకు నేను చూపించాలనుకునే దృశ్యమిదే. దాదాపు ఇటువంటి వ్యక్తినే ఒకడిని నేను గత వేసవికాలంలో చూచాను. అతడు ఒకమూల కూర్చుని ముష్టెత్తుకుంటున్నాడు. తన మొండి అవయవాలు వచ్చే పోయేవారికి బాగా కనపడ డానికిగాను అతడు చొక్కాలాగూలు చింపివేసుకుని కూడా కూచున్నాడు.

జూన్ 28, 1951

నిన్నరాత్రి బ్రిటిష్ రాయబార కార్యాలయంలో జరిగిన విందుకువెళ్ళాము. మేడపైన ముందు భాగాన్నుంచి చూస్తే క్రెమ్లిన్ గేటులోనుంచి కారులు వరుసగా బయటికి రావడం కనుపించింది. అక్కడ ఏదో విందు జరిగి వుంటుం దనడం ఖాయం. విందుకు వచ్చినవాళ్ళంతా తిరిగి వెళ్ళిపోతూ వుండి వుంటారు. ప్రముఖుడైన ప్రతివాని కారువెనుక, వాని రక్షకభటుల కారు ఒకటి వుంటూనే వుంది. పారిస్‌నగరాన్నుంచి

గ్రోమికో తిరిగి వచ్చిన సందర్భంలో జరిగిన విందు అయి వుంటుందని మేము అనుకున్నాం. విషిన్‌స్కీ రోగంతో తీసుకుంటూ ఇంకా పల్లెప్రాంతంలోనే వున్నాడు. పశ్చిమ దేశాల మంత్రులతోను, ప్రతినిధులతోను పారిస్ సమావేశంలో తాను పట్టిన తలపట్లను గురించి గ్రోమికో తన వారికి చెప్పి సంతోషిస్తూ వుండి వుంటాడనుకుంటాను!

రష్యా ప్రతినిధి మాలిక్ యుద్ధ విరమణ ప్రతిపాదనలను చేసి చాలా రోజులయింది. ఆ సూచనలపై వివరణ జరగవచ్చునని ఆశించి గ్రోమికోతో ఇంటర్‌వ్యూ కావాలని నా భర్త కోరారు. నిన్న, అంటే 27 వ తేదీ బుధవారంనాడు ఆయన ఇంటర్వ్యూ ఇచ్చాడు. నా భర్త, ఎడ్ ఫ్రీర్స్, డిక్ సర్వీస్ ముగ్గురూ ఇంటర్‌వ్యూకు వెళ్ళారు. ఎడ్ ఫ్రీర్స్ దుబాసీగా పనిచేశాడు. డిక్ సర్వీస్ దూరప్రాచ్య వ్యవహారాల నిపుణుడు.

గ్రోమికోను కలుసుకొనడమంటే నా భర్తకు ఒక విధంగా చాలా ఇష్టం. ఇందుకు మొదటి కారణం, ఆయన మంచి మేధావి; సునిశితమైన ఊహాపోహాలు గలవాడు. అంతేగాక, రష్యన్ పెద్దలు చాలామందిలాగా ఆంతరంగిక సంభాషణలు జరిగేటప్పుడు కూడా చచ్చు ఉపన్యాసాలు దంచే అలవాటు ఆయనకు లేదు. మరొక కారణం కూడా ఏమిటంటే, ఇద్దరూ హాయిగా ఇంగ్లీషుభాషలో సంభాషించవచ్చు. ఐతే, ప్రభుత్వ వ్యవహారపత్రాలను పరస్పరం అందజేసుకునేటప్పుడుమాత్రం, రష్యన్ భాషలో వున్న ప్రభుత్వ పత్రాన్నే ఆయన చదివి వినిపిస్తాడు. అధికార

పూర్వకమైన విషయాలను తెలియజేసేటప్పుడు కూడా ఆయన రష్యన్ భాషలోనే మాట్లాడతాడు. ఇవిగాక, మిగిలిన సాధారణ విషయాలనన్నిటిని గురించి ఆయన ఇంగ్లీషు భాషలో ప్రసంగిస్తాడు. ఇటువంటి ఇంటర్వ్యూలకు ఒక దానికి నేను కూడా హాజరయి రావాలని వుంది. ఈ ఇంటర్వ్యూలను నా భర్త చాలా బాగా నిర్వహిస్తారని ఎడ్ ఫ్రీర్స్, డిక్‌సర్విన్ లిద్దరూ నాతో అన్నారు. ఆయనకు గల ఇటువంటి సామర్థ్యానికిగాను చివరకు రష్యనులు కూడా ఆయనను గౌరవిస్తారనుకుంటాను.

పారిస్‌లో ఉన్నన్నిరోజులు కులాసాగా గడిపారా అని గ్రోమికోను నా భర్త ప్రశ్నించారు. అందుకు సమాధానంగా, అక్కడ తాను చాలా రోజులపాటు ఉన్నట్లు అనిపించిందనీ, ఐనా పారిస్ చాలా సుందరమైన నగరమనీ, "నిజంగా ఫ్రెంచివారి భోజనపదార్థాలు ప్రపంచంలోకల్లా రుచిగావుంటాయి" అనీ ఆయన అన్నాడు. సోవియట్ యూనియన్ ఉపవిదేశాంగమంత్రి ఈ విషయాన్ని ఒప్పుకొనడం గమనించ తగ్గ విషయమే!

మా తోటలో ఎక్కడ చూచినా పొడుగాటి పచ్చని కాండాలు తప్పితే మొక్కలకు ఒక్కపువ్వుగాని, కనీసం ఒక్క ఆకుగాని లేవు! రష్యాలో పూలమొక్కలు పెరిగే తీరు ఇదే అనుపిస్తున్నది. అభాగ్యుడు, మా ముసిలితోటమాలి ఇంకా జైలులోనే మ్రగ్గుతున్నాడు. అతడి విచారణ జరిగినప్పటి నుంచీ అతనిభార్య అతని నింతవరకు చూడనేలేదు. ఖైదీలను చూడటానికి వచ్చినవారు జైలుగేటు ముందు విపరీతంగా

బోరులు తీరి వేచివుంటారని ఆమె చెపుతున్నది. ఐనప్పటికీ, తన భర్త, తనకొడుకు జైలునుంచి విడుదల కాగానే చాలా సుఖంగా వుంటామని కలలుకంటూ ఆమె అర్థంలేకుండా ఊరికే మురిసిపోతున్నది! ఐతే, ఆమెకొడుకు సైబీరియాలో ఇంకా రెండున్నర సంవత్సరాలపాటు ప్రవాస శిక్ష ననుభవించవలసి వుంది.

జులై 6, 1951

జులై నాలుగున అమెరికా స్వాతంత్ర్యదినం రావటం, పోవటం కూడా అయింది! మొఖొవాయా భవవంమీద పెద్ద అమెరికన్ పతాకం ఎగరవేశాం. ఈ సంవత్సరం సాయంత్రపు విందును ఏర్పాటుచేశాము. సాయంత్రం సరిగ్గా ఆరింటికల్లా నేను, నా భర్త విందుకు వచ్చే అతిథులకు ఆతిథ్యమివ్వడానికి సిద్ధంగా నిలబడ్డాము. ఏడుగంటలు దాటిన తరువాతమాత్రం మేము అక్కడినుంచి వచ్చి అతిథులను చేరుకున్నాం. అప్పటికీ ఇంకా రావలసిన వాళ్ళకు ఆతిథ్య మివ్వడానికిగాను వాలీ బార్బర్, కమ్మింగ్స్ దంపతులు నిలబడ్డారు. ఆహ్వాన పత్రాలమీద "ఆరుమొదలు ఎనిమిదింటివరకు" అని వుంది. అతిథులలో చాలామంది పెందరాడే వచ్చి, చివరివరకు వున్నారు. ఆ వచ్చిన కొద్దిమంది రష్యనులు కూడా చాలా కులాసాగా గడిపినట్లున్నారు.

రష్యా విదేశాంగకార్యాలయంనుంచి ఈసారి ఎవరు వస్తారా అని మేము అంచనాలువేశాము. గత సంవత్సరం ఉట్టి చెత్తా కానీ రకాన్ని పంపారు. వాళ్ళు వచ్చి ఒక్క ఇరవైనిముషాల సేపుమాత్రం వుండి చక్కా వెళ్లారు. అందువల ఈ సంవత్సరం అక్కడనుంచి ఆహ్వానించ తగ్గ వాళ్ల

జాబితాను చాలావరకు తగ్గించి, ఎవరెవరిని పిలవాలో జాగ్రత్తగా నిర్ణయించాము. విషిన్‌స్కీకి సుస్తీగావున్న మాట ఖాయం. కొన్నిమాసాలుగా ఆయనను చూచిన వారే లేరు. తదితర రష్యన్ ఉపమంత్రులతోపాటు గ్రోమికోను కూడా పిలిచాము. వారిలో ఎవ్వరూ రాలేదు. సరే, ఇందుకు పనులవత్తిడి మొదలైన కారణాలు వుండనే వున్నాయి! కాని రష్యా విదేశాంగకార్యాలయపు సీనియర్ సహాయ కార్యదర్శిమాత్రం వచ్చాడు. (ఈయనను వారు సెక్రెటరీ జనరల్ అంటారు.) ఇంకా, కాన్స్యులర్ శాఖాధికారి, ప్రచురణశాఖాధికారి, మరి ఇద్దరు ముగ్గురు వచ్చారు. రష్యా విదేశాంగకార్యాలయంలో అమెరికా వ్యవహారాలను చూచే విభాగప్రధానోద్యోగి, ఆయన భార్య కూడా వీరిలో వున్నారు. ఆయన భార్య మంచి అందగత్తెనని చెప్పవచ్చు. నిజానికి, మదాం గ్రోమికోను మినహాయిస్తే, శ్పాసో భవనంలో జరిగే విందుల ఆహ్వానాన్ని అంగీకరించి వచ్చిన మొట్టమొదటి రష్యన్ స్త్రీ ఈవిడే.

ఈవిడ, ఈవిడ భర్త ఇటీలనే అమెరికా నుంచి తిరిగి వచ్చారు. ఈమె అమెరికాలో కొనుక్కొని తెచ్చుకున్న గౌను తొడుక్కున్నది. ఇంగ్లీషు బాగా మాట్లాడిందికూడా. ఎవరైనా పలకరిస్తే నవ్వుతూ సమాధానం మిచ్చింది. నిజానికి, ఆ సాయంత్రమంతా కూడా ఆమె చాలా కులాసాగా గడిపిందనడానికి సందేహ మేమీ లేదు.

చాలా ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే, పెందరాడే వచ్చిన వారిలో చెకొస్లవాకియా రాయబారి, ఆయన

భార్య కూడా వున్నారు. ఈ దంపతులు వయసు మళ్ళిన వారు; తమ వివాహపు స్వర్ణోత్సవం అప్పుడే జరుపుకుని వచ్చినట్లుంది వీరి రాక తీరు! విందు వేడుకలు అంతా అయిపోయే వేళకు పోలిష్ రాయబారి వచ్చాడు. ఈయన ఆకారం నానా ఖంగాళీగానూ వుంది; లోపలికి ప్రవేశిస్తూ వుంటే ఆయనను మొదట ఎవరూ గుర్తుపట్టనే లేదు. ఈ రాయబారు లిద్దరి రాక — కొరియాయుద్ధ విరమణసంధి జరగడానికి ముందు సూచనలు కాబోలునని మేమనుకున్నాం. గత సంవత్సరారంభాన్నుంచీ ఇంతవరకు రష్యా ఉపగ్రహ రాజ్యాల ప్రతినిధులు శ్పాసో భవనానికి రావడం ఇదే మొట్టమొదటిసారి.

ఒక మంచి అమెరికన్ చుట్ట ఏమైనా దొరుకుతుందేమోనని ఆశపడి తానీ విందుకు వచ్చానని చెకొస్లవాకియా రాయబారి వాఘన్ మాతో చల్లగా బయటపెట్టాడు! ఇది విని మేమంతా విస్తుపోయాము. మాలో ఎవరిదగ్గర చుట్ట లేమీ లేవు. అసలు ఆ చుట్టలపొగ అంటే నాకు మహా చెడ్డ చిరాకు. అందువల్ల మాభవనంలో ఉండే వాళ్ళెవ్వరూ చుట్టలు కాల్చరు.

చెకొస్లవాకియా రాయబారి కోర్కె వినగానే వాఘన్ బయలుదేరింది చుట్టల కోసం! ఒక పెట్టెడు చుట్టలు డిక్ ఎక్కడో దాచాడని తెలుసుకుని, వాటిని వెతుక్కు రమ్మని ఆయనను పంపించింది. ఈ లోపల, ఈ సంభాషణంతా విని, ఫాదర్ బ్రెస్సార్డు తన జేబులో నుంచి ఒక చుట్టతీసి చెకొస్లవాకియా రాయబారికిచ్చి, వాటికన్ నుంచి

క్రైస్తవ మతాధిపతి చెకొస్లవాకియా రాయబారికి ఒక్క చుట్ట సరఫరా చేస్తే బాగుండునని అన్నాడు. ఇలా అంటున్నప్పటికీ ఆ చుట్టను ఇస్తున్న దెవరో కూడా మరచిపోయి పరమానంద పడుతూ దాన్ని కాల్చి, డిక్ ఇచ్చిన మిగతా మూడు చుట్టలను ఇంటికి పట్టుకుపోవడానికిగాను జేబులో భద్రంగా దాచుకున్నాడు!

జులై 16, 1951

నేటి టెంపరేచరు తొంభై ఐదు డిగ్రీలు! వీధులన్నీ శుభ్రంగా ఎన్నడూ తుడిచినపాపాన పోనందువల్ల దుమ్ము కొట్టుకుంటూ వుండే మాస్కో నగరంలో తొంభై ఐదు డిగ్రీలంటే చాలా వేడి అన్నమాట. మెంఫిస్‌నగరంలో కంటే, యుక్రెయిన్ రాష్ట్రంలోని ఖార్కోవ్ నగరంకంటే, అసలు సోవియట్ యూనియన్‌లోని మిగతా అన్నిచోట్లకంటె కూడా మాస్కోలోనే ఎండ వేడి హెచ్చు.

నిన్న ఆదివారం కావడంవల్ల ప్రతివాళ్ళూ రైళ్ళలోను, బస్సుల్లోను, చివరికి లారీల్లోను పడి మాస్కోనగరం వెలుపల కులాసాగా గడిపి రావడానికి వెళ్ళారు. మేము కూడా పోయి విమానాశ్రయానికి వెళ్ళే రోడ్డువారగా వున్న తోటలో పిక్నిక్ (వనభోజనం) జరుపుకున్నాం. నా భర్త వెంటవుండే రష్యా రహస్యపోలీసులు కూడా చాలా కులాసాగా గడిపారు.

అక్కడ కూడా ఎండ తగ్గేవరకూ చెట్లక్రింద చాలా కులాసాగానే వుంది. తిరిగివచ్చిన తరువాత ఆ రాత్రి డిక్‌కు విందు నిచ్చాము. ఆయన రేపు ఉదయం వెళ్లి పోతున్నాడు. రైలులో బయలుదేరి లెనిన్‌గ్రాడ్‌కు, అక్కడనుంచి హెల్సింకీ

నగరానికి పోయి, అక్కడినుంచి విమానంలో బ్రసెల్స్ నగరానికి వెడతాడు. ఆయన కుటుంబంవారు ఆయనను బ్రసెల్స్ నగరంలో కలుసుకుంటారు. ఆయన వెళ్లిపోవడం నిజానికి ఇక్కడ మా కందరికీ ఎంతో విచారకరమైన విషయం.

నాకు కూడా బ్రస్సెల్స్ నగరానికి వెళ్లిపోవాలని వుంది. ఇంకా ఇక్కడ మిగిలివున్న కొద్దిమంది విదేశ రాయబార కార్యాలయ ముఖ్యోద్యోగులలో మేము, మాతోపాటు ఫ్రెంచి, బ్రిటిషు రాయబారులు కూడా ఉన్నారు. మిగిలిన వాళ్ళంతా, పరిస్థితులు ఇప్పట్లో మరేమీ విషమించబోవు లెమ్మని నమ్మి కులాసాగా ఇక్కడనుంచి సెలవు తీసుకున్నారు.

మాకు, మాతోపాటు బ్రిటిష్, ఇటాలియన్, ఫ్రెంచి రాయబారులకు బర్మారాయబారి నిన్నరాత్రి మాస్కో హోటల్ పై ఆవరణలో విందుచేశాడు. క్రెమ్లిన్‌కు అభిముఖంగా వున్న మాస్కో హోటల్ పైభాగం; అక్కడ ఐదుగురు రాయబారులు ఒకచోటచేరి విందు జరుపుకొనడం— ఈ దృశ్యాన్ని ఊహిస్తూవుంటే, వాస్తవానికి అక్కడ జరిగిన దానికంటె గొప్పగా తోస్తుంది! ఒక పొడుగాటి మేడ పై అంతస్థులో వున్న దీ హోటలు. హోటలు మధ్యభాగంలో ఆర్కెస్ట్రా (జంత్రవాద్యాలు) అమర్చుకొనడం కోసము, డాన్సులు జరుపుకొనడం కోసము, కొంత స్థలము ఖాళీగా వదిలి వేయబడి వుంది. హోటలు నిండా జనం కిట కిట లాడుతున్నారు—ఇక్కడ వున్న వారిలో సామాన్య పౌరులు, తల అంతా నున్నగా క్షవరం చేయించుకుని, మురికి ఓడు

తున్న తెల్లచొక్కాలుగాని, చెమట చారికలు కట్టివున్న నీలం రంగు జెర్సీలు (స్వెట్టర్లు) గాని ధరించారు. వీరితోపాటు నలిగిపోయిన ఖాకీ యూనిఫారాలు ధరించిన సిపాయిలుకూడా వున్నా రిక్కడ. స్త్రీలలో కొందరు, నేత చిక్కదనం ఏమీ లేని అద్దకపునూలుబట్టలు ధరించారు. మరికొందరుఇప్పటికీ శీతకాలపు దుస్తులు (శాటిన్, ముఖ్‌మల్ పట్టీలతో ఫిల్టులుపోసి కుట్టిన ఆకుపచ్చరంగు, ఎరుపురంగు (కేపు గుడ్డవి) ఇంకా తొడుగు తున్నారు! వారు ఇలా వేసవికాలంలో కూడా శీతకాలపు దుస్తులు ధరించడానికి కారణం, వారికున్న మంచి బట్టలల్లా అవే అయివుండట మనుకుంటాను.

చాలా మంది స్త్రీల చేతులకు గడియారా లున్నాయి. ఇలా గడియారాలు పెట్టుకొనడం సోవియట్ యూనయన్‌లో ఒక ఘనత! కొందరు ఉంగరాలు, పమిట పిన్నీసులు ధరించారు. మత వ్యతిరేక భావాన్ని అటుంచినప్పటికీ, ఒక విధంగా చూస్తే రష్యాలో పెళ్లి ఉంగరాలు ధరించినవారు చాలా తక్కువమంది ఉండటంలో ఆశ్చర్యమేమీ లేదు. మొన్న నేనొక షాపులో ఒక పళ్ళెంనిండా బంగారపు ఉంగరాలు చూశాను. ఇవన్నీ సాదగానే వున్నాయి. ఐతే, వీటిలో అతి చౌక ఉంగరం ఖరీదే 80 డాలర్ల దాకా ఉన్నది! క్రిందటి నెలలో ఎడిత్ ముస్సెన్ మమ్మల్ని చూడడానికై ఇక్కడికి వస్తుండగా ఫిన్లెండు సరిహద్దులవద్దనున్న కస్టమ్స్ ఉద్యోగులు ఆమె సామానులను తనిఖీ చేస్తున్నప్పుడు ఆమె వద్దనున్న వజ్రాలపైనకంటె, ఆమె బంగారపు మురుగులపైన విశేషమైన శ్రద్ధ కనపరచారట! ఆవిడకు ఒకజత కొత్తరకం

ఖురుగులు వున్నాయి. ఖైదీలకు వేసే బేడీలంత పెద్దవిగా కూడా వున్నాయి ఇవి! అందువల్ల కస్టమ్సు అధికారుల దృష్టిని ఇవి విశేషంగా ఆకర్షించి వుంటాయి.

రష్యనులు సాయంత్రం పూట హోటలుకు వెళ్ళారంటే ఇకను ఆ పూట వారు బయటకు తిరిగి రావటమంటూ వుండదు. ఆ చెల్లించిన డబ్బుకు సరిపడ్డంతా రాబట్టుకుని మరీవస్తారు! గంటల తరబడి హోటల్లో బల్లలముందు కూర్చుని ఈ పళ్ళెంలో నుంచి కొంచెం, ఆ పళ్ళెంలోనుంచి మరి కొంచెం తింటూ, గ్లాసు తరువాత గ్లాసు చొప్పున సారాయి అదే పనిగా దిగత్రాగుతారు. కూర్చున్న చోట నుంచి లేవటం దాదాపు దుర్లభమయి పోయేవరకు, తలతిరిగి బల్లమీదికి జారగిలపడి పోయేవరకు వీరిలా సారాయి త్రాగటం పరిపాటి. ఒకడి పని ఇలాగే కావటం నిన్న నేను చూచాను. అతడి పక్కను మరి ముగ్గురు కూడా కూర్చుని వున్నారు. వారిలో ఒక ఆడమనిషి కూడా వుంది. ఆమె వెండిగొలుసులు ధరించి వుంది. ప్రాచ్య దేశాలలో చాలా మంది మాదిరిగా ఆమె ముఖంపైన ఒక విధమైన మేలి ముసుగు కూడా వుంది. ఉజ్బెక్ జాతికో, అటువంటి మరేదో జాతికో చెందిన స్త్రీ అయివుంటుందామె. ఆమెతో పాటు వున్నవాళ్లలో ఒకడు మాత్రం మామూలుగా అందరి లాగా గోధుమరంగు సూటు ధరించాడు; మరొకడు తెల్లని ఒదులు లాగూ తొడిగి, చొక్కాను లాగూ లోనికి దోపుకున్నాడు. అతడు అదేపనిగా కబుర్లు చెపుతూ, తనమాటలకు తగ్గట్లు చేతిలోనున్న ఫోర్కును అటూ ఇటూ ఆడిస్తున్నాడు.

ఈ హోటల్లో పదార్థాలు వడ్డిస్తున్న వాళ్ళు తెల్లని ఒదులుచొక్కాలు తొడుక్కున్నారు. వాళ్ళ చేతుల్లో వున్న రుమాళ్ళు మురికి ఓడుతున్నాయి. వాళ్ళందరూకూడా తలలు నున్నగా గొరిగించు కున్నారు. నిజానికి వాళ్ళంతా ఇటువంటి ముందు జాగ్రత్త వహించడం ఒక విధంగా, అక్కడకు వచ్చే వాళ్ళ అదృష్టమనే చెప్పాలి. మరి ఇన్ని జాగ్రత్తలు వహించినా కాని, నా కోసం తెచ్చిన శాలడ్ లో ఒక పెద్ద వెంట్రుక వుంది !

మంచుతో చల్లారపెట్టిన చేపలకూర, పచ్చి దోస కాయ ముక్కలు, టొమాటోపళ్ళు, కేవియార్ (ఒక తరహా చేపగుడ్లతో చేసే విలువైన పదార్థం), పచ్చి చేపముక్కలు, నానురొట్టె ముక్కలు మొదలైన చాలా రకాల పదార్థాలు మాకు వడ్డించారు. ఐతే, మమ్మల్ని విందుకు పిలిచిన బర్మా రాయబారి శాకాహారి. నిజానికి, ఆయన పనే బాగుంది. అసలు, మాకు వడ్డించిన పదార్థాలన్నిటినీ తినకుండా వదిలి పెడితేనే మా పని బాగుండే దనిపించింది! సరే, ఆ తరువాత వేపించిన బంగాళా దుంపలు, కోడిమాంసపు కట్లెట్ లు పళ్ళాల నిండా కుప్పలు కుప్పలుగా పేర్చుకుని తెచ్చి వడ్డించారు. ఈ బంగాళా దుంపలు పీలగా, జిడ్డు ఓడుకుంటూ వున్నాయి. కట్లెట్టుకు పైన అంతా వేపించిన కొవ్వుమాంసం గడ్డకట్టుకుని వుంది. విందు భోజనం ఆఖరున నోటితీపి కోసం ఐస్ క్రీమ్, జల్దరుపళ్ళు వడ్డించారు.

ఈ భోజనం అంతా చాలా నాసిరకంగా వుంది. కాని దీని ఖరీదు మాత్రం చాలా దారుణంగా వుండి వుంటుంది.

బర్మా రాయబారికి ఈ విందుకుగాను ఎంత ఖర్చు అయివుం టుందో తల్చుకుంటే నా ఒళ్ళు జల్దరిస్తున్నది.

నలుచదరంగా వున్న ఒక ప్రత్యేక ప్రదేశంలో మేము విందుజరుపుకున్నాం. ఆప్రత్యేకమైన ఆవరణచుట్టూ ఏదో తీగె మొక్కలు దడికట్టి వున్నాయి. అవి బటానీ తీగె లేమోనని నా ఉద్దేశం. కింద అమర్చిన తొట్లలోనుంచి అవి పెరుగు తున్నాయి. మేము కూర్చున్న చోట విపరీతంగా ఉక్క పోయ్యటం ప్రారంభించింది. చివరకు మా కుర్చీలను రవ్వంత గాలి సోకటానికి వీలున్న చోటకు ఈడ్చుకుని, రోడ్డువెంట వచ్చే పోయే జనాన్నిచూస్తూ కూర్చున్నాం.

క్రెమ్లిన్ ప్రాకారంపై నున్న పెద్ద గోపురాలమీాది "రెడ్ స్టార్స్" రెంటికి నట్టనడుమనుంచి చందమామ చల్లగా పైకివచ్చింది. ఫ్రెంచిరాయబారి భార్య మదాం చాటెనాయ్ ఇంగ్లీషు మాట్లాడలేదు; బర్మా రాయబారి ఫ్రెంచి భాష మాట్లాడలేడు. ఇటువంటి పరిస్థితుల్లో బ్రిటిషు రాయబారి భార్య లేడీ కెల్లీ వారిద్దరితోను సంభాషించడానికి పూనుకుని చాలా సమయస్ఫూర్తిని ప్రదర్శించింది. ఫ్రెంచి రాయబారి చాటెనాయ్‌తోను, బ్రిటిష్‌రాయబారి సర్ డేవిడ్ కెల్లీతోను నా భర్త మాటలు కలిపారు. బర్మా రాయబారిని, ఆయన భార్యనూ నేను కబుర్లలోకి దింపాను. వాళ్ళ దేశాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టాను. దానితో క్రీస్తు పూర్వము 500వ సంవత్సర కాలంనుంచీ బర్మా దేశచరిత్రను ఆయన చెప్పుకొచ్చాడు. ఐతే, ఆయన చెప్పిందంతా నాకుమాత్రం ఏదో గందరగోళంగా వుంది.

చందమామ, రెడ్‌స్టార్స్, బర్మా దేశచరిత్ర, రష్యన్, హొటలు వాతావరణం—ఇవన్నీ పదిగంటలు అయేసరికల్లా ఇక చాలనిపించింది! మా వెంటవుండే రష్యా రహస్యపోలీసులు (నా భర్త వెంట వుండేవాళ్ళు, సర్ డేవిడ్ వెంట వుండే వాళ్ళు కలసి నిన్నరాత్రి వీళ్ళసంఖ్య ఎనిమిదిదాకా పెరిగింది!) కూడా బీరు సారాయిలు పుచ్చుకోనడం పూర్తయింది.

జులై 24, 1951

రష్యనులతో శాంతి విషయమై మాట్లాడడానికిగాను వచ్చిన "క్వేకర్స్" అనే మిత్ర సంఘ ప్రతినిధులతో కలసి రాత్రి భోజనం చేయడానికి రావలసిందని లేడీ కెల్లీ నన్ను కోరింది. కమ్యూనిస్టు అభిమానులుగా వీ రిక్కడకు రాలేదు. మనసారా శాంతిని వాంఛిస్తున్న వీరు, రష్యనులు పలికే శాంతి ప్రవచనాలలో ఏ పాటి నిజాయితీ వున్నదో తెలుసుకుందామని వచ్చారు. వీరికి వెళ్ళినచోటల్లా సోవియట్ ప్రభుత్వం ఆతిథ్యమిచ్చిందనీ, మేము వెళ్ళకూడదని సోవియట్ ప్రభుత్వం నిర్ణయించిన ప్రదేశాలకు కూడా వీరు వెళ్ళడానికి అనుమతిస్తున్నదనీ సర్ డేవిడ్ కెల్లీ అన్నాడు.

ఈ మిత్రసంఘ ప్రతినిధులుగా వచ్చిన వారు బ్రిటిష్ వ్యాపార రంగంలోను, సాంస్కృతిక రంగంలోను, ప్రముఖ పాత్ర వహిస్తున్న వ్యక్తులు. చాక్‌లెట్లు తయారుచేసే పెద్ద వ్యాపారసంస్థ అధిపతి అయిన కాడ్బరీ; నేషనల్ కోల్ బోర్డు సభ్యుడు మెట్కాఫ్; డాక్టరు, బాల మనస్తత్వ శాస్త్రజ్ఞురాలు అయిన మిస్ క్రీక్; నిరుడు కొంతకాలం పాటు ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలలో

పాల్గొన్న బెయిలీ మొదలైనవారు ఈ మిత్రసంఘ ప్రతినిధి వర్గంలో వున్నారు. మామూలు పద్ధతిగా "వోడ్కా (ఘాటైన రష్యన్ సారాయి) చాంద్రాయణం"తో సోవియట్ పెద్దలు దిగ్భ్రాంతిని కలిగించడానికి వీలయినవాళ్ళుకారు ఈ ప్రతినిధి వర్గం వారు. యుద్ధాలను, మారణాస్త్రాలను ప్రపంచంలో రూపుమాపాలనే నిశ్చితాభిప్రాయం కలవారు వీరు. సరే, రష్యావారుకూడా తమ శాంతి కార్యక్రమం హృదయపూర్వకంగా ప్రారంభించబడిందేనని ఈ మిత్రసంఘంవారిని నమ్మించడానికి సకల విధాలా ప్రయత్నిస్తారు! కాని, ఈ మిత్రసంఘ ప్రతినిధివర్గంవారు చాలా సునిశిత మేధావంతులు. అందువల్ల, ఇటువంటి ఎత్తులేమీ వీరిదగ్గర సాగవు.

జులై 25, 1951

కెల్లీ దంపతులతో చాలా కులాసాగా గడిపాను. మిత్ర సంఘం వారితో జరిగిన సంభాషణ కూడా చాలా బాగుంది. నిజంగా వారంతా మేధావంతులుగా కనిపించారు నాకు. రష్యనులు పిల్లల సంరక్షణ విషయంలో చూపే శ్రద్ధను వారు ముఖ్యంగా మెచ్చుకున్నారు.

ఈ మిత్రసంఘ ప్రతినిధివర్గం సోవియట్ యూనియన్‌లో జరిపిన పర్యటన చాలా ప్రధానమైన సంఘటన. ఎందువల్లనంటే, ఏ విధమైన పూర్వాభిప్రాయాలు లేకుండా వచ్చి, సోవియట్ యూనియన్ శాంతి విధానపు మంచి చెడ్డలు నిర్ణయిద్దామని మనస్ఫూర్తిగా ఆశించిన ఒక బృందంవారు వీరు. కమ్యూనిస్టు సంపర్కం లేనటువంటి కొద్దిమంది ఇక్కడ జరిపిన పర్యటనలలో ఇదొకటి.

ఇవ్వాళ ఉదయం త్రెట్యాకోవ్ చిత్రకళా ప్రదర్శన శాలకు వెళ్ళాను. నేను అక్కడి చిత్రాలను చూస్తూవుండగా, మిత్రసంఘ ప్రతినిధులలో కొందరు నాకు ఎదురయ్యారు. ఇవ్వాళ రాత్రి బయలుదేరి వెళ్ళిపోతున్నామని వారు చెప్పారు. అమెరికా, బ్రిటనులను అపహాస్యం చేస్తూన్న వ్యంగ్య చిత్రాలున్న గదిని మాత్రం చూచివెళ్ళటం మరిచిపోవద్దని వారికి చెప్పాను.

రెండు నెలల క్రిందట నేను చూచినప్పటికీ, ఇప్పటికీ ఈ చిత్రకళా ప్రదర్శనశాల పూర్తిగా మారిపోయింది. ఆ వ్యంగ్య చిత్రాలను చూదామని తీరా వెళ్ళేసరికి అవన్నీ అక్కడి నుంచి అదృశ్యమైనాయి! చాలా కొద్ది వ్యంగ్య చిత్రాలను మాత్రం గదిలో ఒక మూలగా చీకటి మరుగున వుంచారు. చైనా-సోవియట్ సంధి సంతకాలు జరుగుతున్నట్లు రచించ బడిన పెద్దచిత్రము, చైనా కమ్యూనిస్టు నాయకుడు మావోసే-టుంగ్, ఇండో-చైనా కమ్యూనిస్టు నాయకుడు హోచి-మిన్ చిత్రాలు మొదలైన చిత్రపటాలు, శిల్పాలు అన్నీకూడా అక్కడినుంచి ఎత్తివేయబడినాయి.

వాటిస్థానంలో కొత్తచిత్రాలు అమర్చబడివున్నాయి. వీటిలో...వివిధ శాంతి సమావేశాల చిత్రాలు; అత్యంత దయామయుడుగా కనుపించేటట్లు రచించిన స్టాలిన్ చిత్ర పటము; ఐక్యరాజ్యసమితిలో విషిన్‌స్కీ ఉపన్యసిస్తున్నట్లు రచించిన బ్రహ్మాండమైన చిత్రము కూడా వున్నాయి. విషిన్‌స్కీ ఉపన్యసిస్తున్న చిత్రానికి "శాంతివాణి" అని పేరు. ఈ చిత్రంలో క్రిందను ఒకమూల అమెరికా ప్రతినిధులను

చిత్రించారు. వారి వెనుక చిరచిర లాడుతున్న ఇంగ్లీషు, ఫ్రెంచి ప్రతినిధు లున్నారు. చిత్రంలో అవతలివైపున గంభీర వదనారవిందులైన యుక్రేయిన్, చెకోస్లవాకియా ప్రతినిధు లున్నారు. ఆశాభావంతోను, కృతజ్ఞతతోను వారి వదనాలు తేజోమయమౌతున్నట్లు ఇందులో చిత్రించారు.

అందరికీ శాంతిసౌఖ్యాలు!—సోవియట్ మాతృభూమి ప్రజలకు చేకూర్చిన వరప్రసాదమిది—అనే భావం స్ఫురించే విధంగా, ఈ చిత్రాల చుట్టూ, దాదాపు వీటికి అంచులు కట్టి నట్లుగా, జీవకళ ఉట్టిపడుతున్న పుష్పాలను, పిల్లల నెత్తుకున్న తల్లులను చిత్రించారు.

అక్టోబరు 4, 1951

సరిగ్గా రెండు సంవత్సరాల నాలుగుమాసాలకుపూర్వం మేము మాస్కో నగరానికి వచ్చినప్పుడు ఎంతోకాలం మే మిక్కడ వుండవలసివున్న దనిపించింది. ఇప్పుడా కాలమంతా గతించిపోయి రెండురోజులుమాత్రం మిగిలివుంది! సామాను లన్నీ తీసి పెట్టెలలోకి సర్దటం పూర్తయింది. మేము ఏవైనా అక్కరలేదని వదిలివేస్తే ఎగరతన్నుకు పోదామని రష్యనులు రాబందుల్లాగా నిలబడి వున్నారు. నేను అందరికీ వీడ్కోలు నమస్కారాలు చేసిరావటంకూడా పూర్తిఅయింది.

స్వీడిష్, పర్షియన్, టర్కిష్, డచ్ రాయబారుల భార్య లను చూచివచ్చాను. పాకిస్తాన్, ఇండియా, నార్వే రాయబార కార్యాలయాల్లో జరిగిన మధ్యాహ్నపు విందులకు వెళ్ళి వచ్చాము. బ్రిటిష్, ఫ్రెంచి రాయబారు లిచ్చిన రాత్రిపూట విందులకుకూడా హాజరయినాము. ఇటాలియన్ రాయబారి

గ్రోసియో, ఆయన సతీమణి ఒకనాడు సాయంత్రం మాకు చక్కని పార్టీ ఇచ్చారు. వీరిద్దరూ ఇన్నాళ్ళూ మాతో ఎంతో స్నేహంగా వున్నారు. నిజానికి, వీరిని వదిలివెళ్ళటానికి ఏ మాత్రమూ మనసొప్పటంలేదు కూడాను. మా రాయబార కార్యాలయంలో పనిచేస్తున్నవారు నాకు కొన్ని బహుమానాలిచ్చి, కంట తడిపెట్టారు. ఇంతకాలంగా మేమంతా ఎంతో సన్నిహితులమైనాము; ఒకరికి మరొకరు ఆసరాగా వుంటూ వచ్చాము. ఆ వేదనతో ఇటూ అటూ తచ్చాడుతున్న పనివాళ్ళ కళ్లు దుఃఖంతో జేవురించాయి. నిర్భాగ్యులు! రష్యాలో వారికున్న భద్రత అతి స్వల్పం.

కాని, మేమిక్కడనుంచి వెళ్ళిపోతున్నామన్న విషయం తల్చుకున్నప్పుడు మాత్రం ఏదో, అనిర్వచనీయమైన విచారానికి లోనవుతున్నాను. వెన్నెల్లో రెడ్ స్క్వేర్‌ను, క్రెమ్లిన్ భవనాన్ని కడసారి చూచాను. జనసమ్మర్దం ఎక్కువగా వుండే ఆర్బత్ వీధిగుండా కడసారి నడిచివెళ్ళాను. గోధుమరంగు కోటులు ధరించి, మడ్డివోడుకుంటూ వున్న రష్యా రహస్య పోలీసు ఒకడు ఆ రోడ్డువెంట నన్ను అంతసేపూ అనుసరిస్తూనే వున్నాడు. శ్వాసో చౌకుగుండా అక్కడ ఇసకలో పిల్లికూనల్లాగా ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తూ కడసారి నడిచివెళ్లాను. అక్కడ ఆకాశాన్ని అంటుతున్నదేమో నన్నట్లు చాలా అంతస్తులున్న ఎత్తైన భవనం పైకప్పువైపు కడసారిచూచాను. దీని మరమ్మతు ఇంకా పూర్తికానేకాలేదు.

ఎల్లుండి ఉదయం పదిగంటలకు విమానంలో బయలుదేరి మేము వెళ్ళిపోతాం. మమ్మల్ని తీసుకువెళ్లటానికి విమా

నం ఇవ్వాళ సాయంత్రమే వచ్చింది. పోలెండుగుండా మా విమానం ప్రయాణం చేయడానికికూడా అనుమతి వచ్చింది. మా ప్రయాణానుమతి పత్రాలు అన్నీ సరిగావున్నట్లే. మాస్కో విషయాలన్నీ ఒక కలగా, ఒక అనుభూతిగా, మాలో అంతర్భాగంగా మారిపోయి మేము పారిస్ నగరాన్ని చేరుకొనడానికి ఇంకా రెండురోజులు గడువున్నది!

మొత్తానికి, రష్యాను ఎన్నటికీ మరిచిపోలేము.

[illegible]

[illegible]

[illegible]